# శ్రీవాణి జన్మదినోత్సవ ప్రత్యేక సంచిక

శ్రీవాణి మూడు సంవత్సరములు పూర్తిచేసికొనిన సందర్భమున జనవరి 1988 సంచిక జన్మదినోత్సవ ప్రత్యేక సంచికగా వెలువడబోతున్నది. ఎక్కువ పేజీలతో ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన వ్యాసములతో; బాలవాణి, మహిళావాణి, అమృతవాణి శీర్షికలతో; కథలు, కవితలు, సీరియల్స్‌తో విజ్ఞానప్రదాయినిగా వెలువడబోతున్నది.

**"మానవతా విలువలు" మీద ప్రత్యేక వ్యాసం కూడా రాగలదు.**

సహృదయంతో వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తలు అడ్వర్‌టైజ్‌మెంట్సుతో సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను.

జీవిత సభ్యత్వం రు. 500/-లు పంపినవారి ఫోటోలు కూడా ముద్రించబడుతాయి. ఉదారవదాన్యులు సహకారం అందించి 'శ్రీవాణి'ని ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను.

## ప్రకటనల వివరాలు

| | |
|---|---|
| BACK COVER (4th page) (Multi Colour) | Rs. 2500/- |
| II & III COVER (Single Colour) | Rs. 2000/- |
| OPENING PAGE (Single Colour) | Rs. 1500/- |
| DELUXE PAGE | Rs. 1000/- |
| FULL PAGE (ordinary) | Rs. 600/- |
| 1/2 PAGE | Rs. 300/- |

Address :
Manager, 'SREEVANI'
24-51, Ramanaidupet
MACHILIPATNAM - 521 001

## చందా వివరములు

సం. చందా : రు. 36-00
4 సం. చందా : రు. 116-00
జీవితసభ్యత్వం : రు. 500-00
(జీవిత సభ్యుల ఫోటోలు ముద్రించబడుతాయి)

గమనిక : సం. చందా మరియు 4 సం. చందాలు M.O. లేక D.D. ద్వారానే పంపవలయును. జీవిత సభ్యత్వం మరియు అడ్వర్‌టైజ్‌మెంట్సు మొత్తములు "చెక్" ద్వారా పంపినా ఫరవాలేదు.

**Cheques & Drafts should be drawn in favour of 'SREEVANI' monthly, Machilipatnam**

చందాలు కట్టవలసినవారు, రెన్యూవల్ చేయవలసినవారు వెంటనే పంపి సహకరించ ప్రార్థన.

---

తృతీయ వార్షికోత్సవము 1988 జనవరి 11వ తేది సోమవారం సాయంత్రం గం. 5-58 ని॥కు మచిలీపట్నం, ముట్నూరి కృష్ణరాయపురమందిరం (టౌన్ హాలు)లో జరుగుతుంది.

ఇదే ఆహ్వానముగా భావించి పాల్గొన ప్రార్థన. — సం॥

డిశంబరు - 1987
సంపుటి : 3
సంచిక : 12

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 3-00 |
| సంవత్సర చందా | : రు. | 36-00 |
| 2 సం॥ల చందా | : రు. | 66-00 |
| 4 సం॥ల చందా | : రు. | 116-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 500-00 |

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయసూచిక



ముఖచిత్రం :
భారత ప్రథమ రాష్ట్రపతి డా॥ బాబూ రాజేంద్రప్రసాద్



# నిప్పు దే కులం ? జలము దే కులం ?
# మానవులంతా ఒకే కులం....

**భారతీయులు** స్వతంత్రం పొందగలిగారు గాని, ఐక్యతను మాత్రం సాధించలేకపోతున్నారు. ఐక్యతలేని స్వాతంత్ర్యము కరెంటులేని వైరు వంటిది. భారతీయులది పవిత్రమైన సనాతన ధర్మము. ఈ పవిత్ర భూమి అవతారములకు ఆటపట్టు. ఋషులు, మునులు, యోగులు, వీరులు, ధీరులు, శూరులు, పతివ్రతామ తల్లులకు పుట్టినిల్లు. మబ్బులు కప్పిన సూర్యుడు కొంతకాలం కనిపించకపోవచ్చును. అదే విధముగనే కొన్ని సంప్రదాయములు, కొన్ని ఆధునిక పద్ధతులు అనే మేఘములు అడ్డగించడం చేతనే భారతీయ సంస్కృతి కొంత మరుగైనది గాని, దీనికి ఏమాత్రం నాశనం లేదు.

## శ్రీసత్యసాయిబాబా

### భారతీయ సంస్కృతి

విదేశీయులు సహస్ర నేత్రములతో భారత దేశం వైపు చూస్తున్నారు. అనేక ఆశలతో ఎదురు తెన్నులు చూస్తున్నారు. కాని భారతీయులకు వారసత్వమైన ఈ సంస్కృతిని భారతీయులే తొలగించుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. ఇది మిక్కిలి దురదృష్టం. భారతీయులు ఈనాడు లౌకికమైన భోగ భాగ్యములను ఆశించి, దివ్యమైన, భవ్యమైన మన సంస్కృతిని విస్మరిస్తున్నారు. భౌతిక సంపదలు అవసరమే. కాని భౌతిక సంపదలతోపాటు, ఆధ్యాత్మిక సంపదను కూడా అభివృద్ధి గావించుకున్నప్పుడే తిరిగి మనం ఇతర దేశములకు కొన్ని ఆదర్శములను అందించే స్థితిలో ఉంటాం, ఈనాడు భారతీయ సంస్కృతిని ప్రభుత్వం కూడా విస్మరించడం కడు శోచనీయం. ఆదర్శములు, ఆలోచనలు ఉన్నతములుగా ఉండవచ్చును గాని, వీరి దృష్టి అంతయూ పాశ్చాత్య నాగరికత పైననే ఉండిపోతున్నది. భారతీయులు కూడా పాశ్చాత్య నాగరికత వైపే తమ దృష్టిని మరలుస్తున్నారు. ఇది దురదృష్టకరం.

మండెడు కాంతితో మేరు పర్వతముండ
వెండి బంగారులకై వెదుకనేల ?
కోరిన ఫలమిచ్చు కల్ప వృక్షము వుండ
పెరటి పుష్పమునకై ప్రీతినేల ?
అడిగిన పాలిచ్చు కామధేనువుండ
ధనమిచ్చి ఆవును కొనగనేల ?

ఇట్టి సర్వగుణములతో, సర్వకళ్యాణములతో, సర్వ శక్తులతో ఇమిడియున్నటువంటి భారతదేశాన్ని విస్మరించటం, పవిత్రమైన భారతీయ సంస్కృతిని తూలనాడటం మిక్కిలి విచారకరం.

### ఆధ్యాత్మిక బలం

నిజముగా భారతీయుల మహాభాగ్యం ఇంతా అంతా చెప్పుటకు అలవికాదు. దానిని అనుభవించడానికి కూడా యోగ్యత ఉండాలి. పాండిత్యము వుండవచ్చును. విద్యావంతుడు కావచ్చును. ఎన్ని బలములున్నా, ఎంతటి విద్వత్తున్నా, ఆధ్యాత్మిక బలమే లేనప్పుడు అంతా నిరుపయోగమే అవుతుంది.

శ్రీవాణి



# నిప్పు దే కులం? జలము దే కులం? మానవులంతా ఒకే కులం....

**భారతీయులు** స్వతంత్రం పొందగలిగారు గాని, ఐక్యతను మాత్రం సాధించలేకపోతున్నారు. ఐక్యతలేని స్వాతంత్ర్యము కరెంటులేని వైరు వంటిది. భారతీయులది పవిత్రమైన సనాతన ధర్మము. ఈ పవిత్ర భూమి అవతారములకు ఆటపట్టు. ఋషులు, మునులు, యోగులు, వీరులు, ధీరులు, శూరులు, పతివ్రతామ తల్లులకు పుట్టినిల్లు. మబ్బులు కప్పిన సూర్యుడు కొంతకాలం కనిపించకపోవచ్చును. అదే విధముగనే కొన్ని సంప్రదాయములు, కొన్ని అధునిక పద్ధతులు అనే మేఘములు అడ్డగించడం చేతనే భారతీయ సంస్కృతి కొంత మరుగైనది గాని, దీనికి ఏమాత్రం నాశనం లేదు.

**శ్రీసత్యసాయిబాబా**

## భారతీయ సంస్కృతి

విదేశీయులు సహస్ర నేత్రములతో భారత దేశం వైపు చూస్తున్నారు. అనేక ఆశలతో ఎదురు తెన్నులు చూస్తున్నారు. కాని భారతీయులకు వారసత్వమైన ఈ సంస్కృతిని భారతీయులే తొలగించుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. ఇది మిక్కిలి దురదృష్టం. భారతీయులు ఈనాడు లౌకికమైన భోగ భాగ్యములను ఆశించి, దివ్యమైన, భవ్యమైన మన సంస్కృతిని విస్మరిస్తున్నారు. భౌతిక సంపదలు అవసరమే. కాని భౌతిక సంపదలతోపాటు, ఆధ్యాత్మిక సంపదను కూడా అభివృద్ధి గావించుకున్నప్పుడే తిరిగి మనం ఇతర దేశములకు కొన్ని ఆదర్శములను అందించే స్థితిలో ఉంటాం. ఈనాడు భారతీయ సంస్కృతిని ప్రభుత్వం కూడా విస్మరించడం కడు శోచనీయం. ఆదర్శములు, ఆలోచనలు ఉన్నతములుగా ఉండవచ్చును గాని, వీరి దృష్టి అంతయూ పాశ్చాత్య నాగరికత పైననే ఉండిపోతున్నది. భారతీయులు కూడా పాశ్చాత్య నాగరికత వైపే తమ దృష్టిని మరలుస్తున్నారు. ఇది దురదృష్టకరం.

మండెడు కాంతితో మేరు పర్వతముండ
వెండి బంగారులకై వెదుకనేల ?
కోరిన ఫలమిచ్చు కల్ప వృక్షము వుండ
పెరటి పుష్పమునకై ప్రీతినేల ?
అడిగిన పాలిచ్చు కామధేనువుండ
ధనమిచ్చి ఆవును కొనగనేల ?

ఇట్టి సర్వగుణములతో, సర్వకళ్యాణములతో, సర్వ శక్తులతో ఇమిడియున్నటువంటి భారతదేశాన్ని విస్మరించటం, పవిత్రమైన భారతీయ సంస్కృతిని తూలనాడటం మిక్కిలి విచారకరం.

## ఆధ్యాత్మిక బలం

నిజముగా భారతీయుల మహాభాగ్యం ఇంతా అంతా చెప్పుటకు అలవికాదు. దానిని అనుభవించడానికి కూడా యోగ్యత ఉండాలి. పాండిత్యము వుండవచ్చును. విద్యావంతుడు కావచ్చును. ఎన్ని బలములున్నా, ఎంతటి విద్వత్తున్నా, ఆధ్యాత్మిక బలమే లేనప్పుడు అంతా నిరుపయోగమే అవుతుంది.

శ్రీవాణి

ప్రేమ ధనమును మనం సంపాదించుకొనాలి. ఇది దిక్సూచి యంత్రం వంటిది. దీనిని ఎక్కడ పెట్టినా ఆ ముల్లు ఉత్తర దిశనే చూపిస్తుంది. అదే విధముగనే పరమ భక్తుడైన మానవుని దృష్టి ఏమి చేసినా, ఏమి చూచినా ఏమి చెప్పినా అది భగవంతునిపైననే నిలపాలి. ఈ దివ్య ప్రేమను మాత్రం తనది, పరది అని భేదము లేకుండా పాటించాలి. ఈ పరమభక్తి అనేది పదును గల కత్తి లాంటిది. దీనికి తరతమ భేదములుండవు. అటువంటి దివ్యమైన ప్రేమ తత్త్వాన్ని అర్థం చేసుకోవటానికి మనం ప్రయత్నించాలి.

## మనసు ఒక దొంగ

ఈనాడు సాధనలు మానసికంగా చేస్తున్నాం. వీటికి మనసే అధిపతిగా ఉంటున్నది. మనస్సు అధిపతిగా ఉన్నంతకాలం గమ్యమును అర్థం చేసుకోలేడు, చేరలేడు. దొంగ ఏనాడైనా తనను తాను పట్టించుకుంటాడా? మనస్సు ఒక దొంగ వంటిది. ఆ దొంగను ఆశ్రయిస్తే ప్రయోజనం వుంటుందా? కనుక మనస్సును మనం ఆశ్రయించకూడదు. ఆత్మను దర్శించాలి. మనో నిగ్రహమును అభివృద్ధిగావించుకున్నప్పుడు మనసు సహజంగా దూరమవుతుంది. ఇట్టి మహద్భాగ్యమును పొందే నిమిత్తమై అనేకమంది ఉపదేశములు, ఉపదేశ ములు అని ఆశిస్తుంటారు. ఉపదేశము అంటే ఏమిటి? 'ఓం నమశ్శివాయ, ఓం నారాయణాయ' అనే పద ములు ఉచ్చరించినంతమాత్రమున ఉపదేశములవుతాయా? స్వస్థానమునకు సమీపించుటయే ఉపదేశము. నామములు ఉచ్చరించినంతమాత్రాన ఆ సమీపమునకు చేరలేము. రామ, కృష్ణ, గోవింద, నారాయణ మొదలగు నామము లను ఉచ్చరిస్తున్నాము. ఇవన్నియూ పెట్టిన పేర్లేగాని పుట్టిన పేర్లు కావు. ఇవి ఏనాటికీ స్థిరమైనవి కావు. అన్నిటికన్నా మొదట పుట్టినది "నేను, నేను, నేను" అనేటటువంటిది. కనుక మొట్టమొదట ఈ నేను : అనే సంకల్పాన్ని గుర్తుంచుకోవటానికి ప్రయత్నించినపుడు. సర్వమునూ గుర్తించినవాడవుతాడు. మిగిలిన సంకల్పా లన్నీ 'నేను' అనే సంకల్పం తరువాతనే పుట్టినాయి. కనుక మొట్టమొదట తనను తాను తెలుసుకోవాలి. దీనికి బదులు ఈనాడు భౌతికమైన, లౌకికమైన సాధనలయందే మన కాలమును వ్యర్థం గావించడం సరైన సాధన కానేరదు. అంతటా వున్నది ఒక్క దైవత్వమే. దీనిని మనం అర్థంచేసుకోవాలి.

## ఏకత్వము

సర్వదుఃఖములకు, అనర్థములకు ఈ దేహభ్రాంతియే మూలకారణం. ఈ భ్రాంతిలో వున్నంతకాలం ఆనంద మనే ఫలమును అందుకోలేం. దేహ భ్రాంతిని త్యాగం చేయాలి. "నకర్మణా నప్రజాధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః" కేవలం ధనం వల్ల గాని, సంపదవల్లగాని, ఇంకే కర్మలవల్లగాని ఈ దైవత్వమనే అమృతత్వం మనకు ప్రాప్తించదు. నేను పండితుడను, నేను విద్వాంసుడను అనుకున్నంత వరకు వారు అజ్ఞానులే. ఇవి తనకుతాను పెట్టుకున్న పేర్లే గాని మరొకటి కావు. తాను తానుగా వున్నాననే అర్థాన్ని గుర్తించినవాడే మహా జ్ఞాని. అహంకారం వున్నంతవరకు ఆత్మ సందర్శనం చేయలేడు. అహంకారం నిర్మూలం గావించి ఆచరించే కర్మలే అకర్మలుగా మారుతాయి. కనుక పరమ పవిత్ర మైన భక్తి తత్త్వాన్ని మనం అనుసరించాలి. ప్రేమ తత్త్వానికి మించిన సులభమైన మార్గం వేరొకటి లేదు. అందర్నీ ప్రేమించాలి. ప్రేమలో మహత్తరమైన పటుత్వమైన శక్తి ఉన్నది. ఇది ఐకమత్యమును పెంచుతుంది. ఏకత్వమును సాధిస్తుంది. భిన్నత్వమును మటుమాయం చేస్తుంది. జగత్తులో కనిపించే భిన్నత్వము లన్నీ ఏకత్వం అంశములే. అన్ని భిన్నత్వములకు ఏకత్వమే మూలాధారము. ఈ మూలాధారమైన తత్త్వాన్ని మనం గుర్తించాలి.

## మానవ కులం

భారతీయులు ప్రధానంగా సాధించవలసింది ఏకత్వం. అదే ఐకమత్యం. ఐకమత్యం లేకుండా ఏ చిన్న

కార్యమునయినా సాధించలేం. స్వార్థ స్వప్రయోజనాల తోను, కుల మత భేదాలతోను మనం తగవులాడు కుంటున్నాం. ఈ వర్గ భేదములను ధ్వంసం చేయాలి. ఎవరిది ఏకులం ? మానవకులం, మానవజాతి. మానవు లంతా ఒకేకులం. నేను బ్రాహ్మణుడను నేను శూద్రుడను అని అనుకోవటం ఈ దేహభ్రాంతి వలననే. దేహ భ్రాంతి వలననే ఈ బేధ బావములు కలుగుతున్నాయి. పంచభూతముల దేకులం? నిప్పుదేకులం? జలము దేకులం ? అందరికీ సమానమే గదా! సమిష్టి స్వరూపమైన దేశ తత్వంలోపల మనం అందరం అన్న దమ్ములం, అక్కచెల్లెళ్లం అనే విషయం విస్మరించ రాదు.

## దేహం ఒక విస్తరాకు

ఇటువంటి ఏకత్వ భావన మనలో ఏర్పడాలంటే మనం సేవలలో పాల్గొనాలి. అసలు ఇటువంటి భిన్న భావములు ఏర్పడటానికి కారణమేమిటి? దేహం ఒక విస్తరాకు వంటిది. ఆ విస్తరాకు పైన రుచికరమైన పదా ర్థములు పెట్టుకొని మనం భుజించి, ఆనందించి, తరు వాత నిర్లక్ష్యంగా ఆ విస్తరాకును పారవేస్తాం. అదే విధముగనే నీదేహమనేటటువంటి విస్తరియందు సద్గుణ ములు, సదాచారములు, సత్ప్రవర్తనలు అనేటటువంటి ఫలహారములు పెట్టుకొని, దానిని అనుభవించి, ఆనం దించి, అందించి తదుపరి ఈ దేహమనే విస్తరాకును విసిరి పారవేయాలి. విస్తరి ఉన్నది గదా అని అసహ్య కరమైన పదార్థములు పెట్టుకొని మనం అరగిస్తామా ? మంచి పదార్థములనే మనం ఆశిస్తాం. ఆరోగ్యకరమైన పదార్థములనే మనం కోరుకుంటాం. కనుక ఈ దేహ మనే విస్తరియందు పవిత్రమైన గుణములను మనం వడ్డించుకోవాలి. అరగించాలి. పవిత్రమైన తత్వాన్ని అనుభవించాలి. అనవసరమైన విషయాలలో జోక్యం చేసుకోరాదు. చూడరాని విషయాలను చూడరాదు. విన రాని విషయాలను వినరాదు. చేయరాని పనులను చేయ రాదు. మంచిపనులను మాత్రమే చేయాలి. ఇలాంటి పవిత్రమైన కర్మల చేతనే, ఇలాంటి సార్థకమైన జీవి తాన్ని పవిత్రం గావించుకోవాలి.

## భారతదేశం వెన్నముద్ద

మన సంస్కృతి మూఢ నమ్మకములతో కూడినటు వంటిది కాదు. అనేక విధములైన సాధనలు సలిపి పరిశోధనలు చేసి, అనుభవించి, ఆనందించి పంచి పెట్టినారు మన మహర్షులు దీనిని. భారతదేశం మట్టి ముద్దకాదు. మాంసం ముద్ద అంతకన్నాకాదు. ఇది వెన్న ముద్ద. ఇది అమృతం ముద్ద. ఇది సర్వజ్ఞుడైన భగవంతుని సృష్టికి ప్రతీకం. సర్వత్రా వ్యాపించి, సర్వులలో వుండటం చేత అతను ఏ పనైనా చేయగలడు. తన సంకల్పబలం చేత ఏ వ్యక్తిని, ఏ విధంగా, ఎప్పుడు ఎక్కడ రక్షించాలనే విషయం, శిక్షించాలనే విషయం అతనికి బాగా తెలుసు.

కన్నీరు తెప్పించు, కన్నీరు తప్పించు<br>
యోగి భోగిగ చేయు, భోగి యోగిగ చేయు<br>
ఆలు బిడ్డలను వర్తించు, పిచ్చిపోగొట్టును<br>
తను రక్షించు, హతమొనర్చు

దైవానికి అంతా తెలుసు, ఇదే చేయాలి, అదే చేయాలనే అధికారం ఎవరికీ లేదు. భగవంతునికి స్వార్థమనేదిలేదు. స్వార్థంలేని భగవంతుడు ఏపని చేసినా అది పరార్థమే, దర్మమే. ఇట్టి సత్యరూపమైన, ఆ దైవత్వాన్ని ఆకర్షిం చేది ఒక్క ప్రేమతత్వమే. ఇక్కడికి యింతమంది రావ టానికి ఏ ఆహ్వానమైనా పంపామా ? ఏ పేపరులోనయినా వేశామా ? లేదు. ప్రేమయొక్క ఆకర్షణే దీనికి మూల కారణము. ప్రేమచింతామణి యిక్కడ వుండటం చేతనే యింతమంది యిక్కడ చేరడానికి వీలైంది, ప్రేమ పాశమే వీరందరిని ఇక్కడ కట్టివేసి ఉండాలి. ఇది దైవశక్తి.

## ప్రాప్తియే...

ఈ శక్తులూ, ఆ శక్తులూ ప్రదర్శిస్తున్నారని మీరు భావిస్తుండవచ్చును. ఇతరుల దృష్టిలో ఇది ప్రదర్శన

ములు గాని నాది నాకు నిదర్శనం. ఇది నాకు సహజం. ఇతరుల దృష్టిలో ప్రదర్శనం. ఇది నేను అనుసరిస్తూ పోతున్నాను. ఇది ప్రేమయొక్క సహజం. ఇది అందరికి సాధ్యమయ్యేటటువంటిదికాదు. ఎన్ని ఉపనిషత్తులైనా, ఎన్ని వేదములైనా, ఎన్ని బ్రహ్మసూత్రములైనా చదివి మీరు సాధించండి చూద్దాం! ఏనాటికి ఇది సాధ్యంకాదు. ప్రేమను ఆధారము చేసుకున్న వారికి మాత్రమే ఇది అర్థమవుతుంది. సహజంగానే అందరిలో ప్రేమ వుంటుంది. దీనిని అనుభవించడానికి ప్రయత్నిస్తే అది మీకు లభ్యమవుతుంది. దీనికి ఏమాత్రం నయాపైసా ఖర్చు లేదు. మీకు వచ్చిపోయే చార్జీలు మాత్రమే ఖర్చు. ఇది ఒక పవిత్రమైన ఖర్చే. కనుక పుట్టపర్తి యాత్ర అనే ఖర్చు అది ఒక ఖర్చుకాదు. ఇది ఒక ప్రాప్తియే, ఆ ఖర్చు లేకుండా ఈ ప్రాప్తి మీకు లభ్యం కాదు. ఏ కించిత్తయినా త్యాగం చేసి యిక్కడికి వచ్చినప్పుడే ఈ విధమైనటువంటి భావం అనేటటువంటిది మీకు లభ్యమవుతుంది.

## గుణధనము

భగవత్ ప్రేమ అనేటటువంటిది ఇచ్చి పుచ్చుకొనే టటువంటి ప్రేమ. నేను ఏమిచేసినా, ఏమి చెప్పినా అంతా ప్రజల నిమిత్తమేననే సత్యాన్ని మీరు గుర్తించాలి. ఇందులో స్వార్థం అనేటటువంటిది లేదు. మీరు నమ్మక పోయినప్పటికీ నాకందరూ ఒక్కటే. వారి వారి ప్రాప్తానుసారము వుంటుంది. ఎంత నీరున్నా, ఎంత పాత్ర తీసుకొనిపోతే అంతనీరే లభ్యమవుతుంది. వారి కర్మానుసారంగా, వారి ప్రాప్తానుసారంగా, ఈ అదృష్ట మనేటటువంటిది లభ్యమవుతుంది. కనుక మనం సంక ల్పాలను అభివృద్ధి పరచుకోవాలి. అందువలననే కర్మ చేయాలి. సాధన వలననే శీలం, శీలం వలననే ప్రాప్తి, దృశ్యము. అదృష్ట దురదృష్టములన్ని మన సంకల్ప ముల మీదనే ఆధారపడివుంటాయి. ఎట్టి సంకల్పమో అట్టి ఫలము. కనుక మన కర్మలను మనము దాటక తప్పదు. ఆచరించే తీరాలి. ప్రతి వ్యక్తి భగవంతుని ఆనందంగా ఆరాధిస్తూవుంటే, ఇంతకంటే ప్రాప్తి మరొకటి లేదు. దుర్భావనలు, దుర్గుణములు దురాలోచనలు పెట్టుకొని, సద్భావనలుగా మనం నటన చేస్తే, ఇది మాత్రం భగవంతుని వంచించినట్లవుతుంది. దాగుడు మూతలాడటానికి యిక్కడ ఏమాత్రం అవకాశం లేదు. గుణ ధనమును మనం పెంచుకోవాలి. విశ్వాసబలమును పెంచుకోవాలి. కొందరంటుంటారు. నేను సర్వమూ శరణాగతుడనైనప్పుడు, నన్ను ఎందుకు ఇంత బాధ పెడుతున్నాడు ? నన్ను ఎందుకు ఇంత అవస్థల పాలు చేస్తున్నాడు ? అని భావిస్తుంటారు. నిజముగా శరణాగతి అయినవాడికి ఈ ప్రశ్నలకు ఏమాత్రం అవకాశం ఉండదు. శరణాగతుడైనప్పటికీ నన్ను బాధిస్తున్నాడే? నన్ను అనే భావం ఉన్నప్పుడు ఈ శరణాగతి ఎక్కడ వచ్చింది ? అది చేయనటువంటివాడే ఇట్టి భావములకు గురిఅయ్యేది. కర్మకాండను అభివృద్ధిగావించుకొని దానిని పవిత్రం గావించుకొని, సార్థకం గావించుకొనే నిమిత్తమే మనం హృదయ విశాలతను చేసుకోవాలి.

## నామస్మరణ

కర్మ దాటవశమా? అని అనుమానిస్తుంటారు. ఈకర్మను దాట వశమే. దైవానుగ్రహమువలననే ఇది సాధ్యం. అనుగ్రహం ఒక దైవత్వంలో మాత్రమే వుంటుంది. అణుమాత్రమైన అగ్ని, పర్వతములాంటి ప్రత్తిని ఒక క్షణంలో భస్మం చేస్తుంది. అది ఏ రీతిగా మనకు లభ్య మవుతుంది ? అది ఒక ప్రేమ వలన మాత్రమే లభ్య మవుతుంది. ఈ ప్రేమను మనం పెంచుకోవాలి. ఎవరి సేవలు చేస్తున్నప్పటికీ నామస్మరణ చేస్తునే వుండాలి. లేకపోతే ఈ మనస్సు ఎక్కడెక్కడికో పరిగెత్తుకొని పోతుంటుంది. ఇది చంచలత్వమునకు పుట్టినిల్లు, పెట్టిన పేరు ఈ మనస్సు. కనుక ఇతర చింతనలకు చోటివ్వ కుండా భగవత్ నామాన్ని ఉచ్చరించుకుంటూ, మనం కర్మలో ప్రవేశించాలి.

శ్రీవాణి

## పరదూషణ మహాపాపం

కనుక ఈనాటి నుంచి అచరించ వలసినవి, తెలుసు కోవలసినవి మూడు మాత్రమే. విమర్శించటం మాను కోండి. పరదూషణ మహాపాపం. పరదూషణే మహా పాప మైతే, పరమాత్మ దూషణ మరింత పాపం. ఇతరుల దోషములను మనం ఏమాత్రం విచారించరాదు. పవిత్ర మైన కర్మలలో ప్రవేశించాలి, పవిత్రమైన సేవలు చేయాలి. గ్రామసేవ యన్న రామసేవయే సుమా ! ఇచ్చుకొనుము సేవ, పుచ్చుకొనుము ప్రేమ. సమాజసేవ సర్వేశ్వర సేవగా విశ్వసించాలి. మరొక్క విషయం దృష్టిలో పెట్టుకోవాలి. మనం ప్రభుత్వంతో ఏ మాత్రం సంబంధం పెట్టుకోకూడదు. ప్రభుత్వం చేయవలసిన పనులు ప్రభుత్వం చేస్తుంది. స్వయం కృషితో మనం సాధించాలిగాని, ఇతరుల సహాయం మన కవసరంలేదు. మన శక్తిని బట్టి మనం చేయాలి. 'గంగగోవు పాలు గంటెడైన చాలు, కడవడైన నేమి కరము పాలు.' ప్రభుత్వంతో సంబంధం లేకుండా వుండటం ఒకటి. ప్రవేశించి సేవలు చేయటం రెండవది. మూడవది పరదూషణ లేకుండా ఉండటం. ఇదే నిజమైన సాధన. పరదూషణ మహాపాతకమని చెప్పాలి. నీవు ఇతరులను ఎంత దూషిస్తావో, అంతకు పదిరెట్లు నీవు దూషించ బడుతావనే విషయాన్ని నీవు జ్ఞాపకం పెట్టుకోవాలి. కనుక మనం ఎవర్నీ విమర్శించ రాదు. దూషించరాదు. కనుక భగవంతుని స్మరించు కుంటూ, భజించుకుంటూ, ప్రేమతో సేవలలో పాల్గొని జన్మను సార్థకం చేసుకోవాలి.

## పంచగుణములు

మన జీవితమంతా ద్వైతంలోనే ప్రయాణం సలిపిన గమ్యమైన అద్వైతాన్ని ఏనాడు చేరుతాం ? సత్యమైన అద్వైతాన్ని వదలి అసత్యమైన ద్వైతాన్ని మనం అనుసరిస్తున్నాం, ఇది సరైన మార్గం కాదు. సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలు మనం ప్రదర్శిస్తున్నామే గాని, దర్శించటం లేదు. ఈ పవిత్రమైన పంచ గుణములను మనం దర్శించాలి, ఆచరించాలి. అంతటా గౌరవించబడాలని మానవుడు ఆశిస్తున్నాడేగాని, తాను ఇతరులను గౌరవించటానికి ప్రయత్నించటంలేదు. ఇతరులను గౌరవించటానికి తాను ప్రయత్నించినప్పుడే, ఇతరుల నుండి తాను గౌరవాన్ని అందుకోనే అధికారి కాగలడు. అహంకారమున్నంతవరకు సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలను మనం దర్శించలేము. కనుక మొట్టమొదట మనం ఆచరించి, అనుభవించి, ఆనందించి, పదిమందికి అందించటానికి అవసరమైన శక్తి సామర్థ్యములను సంపాదించాలి.

## శాంతి

మానవుడు ప్రతి ఒక్కడు శాంతిని ఆశిస్తున్నాడు. ఈ శాంతి అన్నది మరొక ప్రదేశంలో లేదు. శాంతి కోసం మతములో వెదకడం కాలం వ్యర్థం చేయటమే. ఇది మతిలో వున్నదిగాని మతములో లేదు. ఈ శాంతిని మొట్టమొదట తనలో అభివృద్ధి గావించుకోవాలి. దీనిని కుటుంబంలోపల అభివృద్ధి చేసుకోవాలి. సమాజంలో అభివృద్ధి చేయాలి. రాష్ట్రమునకు పెంచాలి, రాష్ట్రము నుంచి దేశంలో అందించాలి, వ్యక్తిలో శాంతి లేనప్పుడు దేశంలో ఏ విధంగా శాంతి ఉంటుంది ? దురదృష్టవశాత్తు ఈనాడు శాంతి విశ్వవ్యాప్తం చేయడానికి బదులు తనలో నున్న అశాంతిని కుటుంబంలోను, కుటుంబంలోని అశాంతిని గ్రామంలోను, గ్రామంనుంచి దేశంవరకు అశాంతిని పెంచుతున్నామేగాని శాంతిని పెంచడానికి ప్రయత్నించడంలేదు. శాంతిని పెంచే దూతలంగాని, అశాంతిని పెంచే అవధూతలం కారాదు. ఈశాంతి ఎక్కడ లభిస్తుంది? సేవలో మాత్రమే లభిస్తుంది. ఈ శాంతి చేతనే ప్రేమ అభివృద్ధి గాంచుతుంది. ప్రేమ మొక్కను, శ్రద్ధ, సేవ అనేదాంతో అభివృద్ధి గావించుకోవచ్చును. ఈ ప్రేమను సమాజంలో పెంచాలి, ఇతరులకు పంచాలి. ఇచ్చి పుచ్చుకున్నప్పుడే ప్రేమ అభివృద్ధి గాంచుతుంది. దీని వలన సంకుచిత భావములు పోయి, విశాలమైన భావములు మనలో ఆవిర్భవిస్తాయి.

## సేవయందే ...

దేహం కూడా ఒక పంపుసెట్టు వంటిది, జనరేటర్ వంటిది. పని చేయకపోతే మిషన్ తుప్పుపడుతుంది. అదే విధముగా పనిచేయకుండా సోమరిలా ప్రవర్తిస్తే ఈ శరీరంకూడా అనారోగ్యానికి గురి అవుతుంది. అయితే ఎంత పని చేయాలి? ఆరోగ్యం దెబ్బ తినకుండా చూచుకుంటూ పనిచేయాలి. జడమయమైన మిషన్‌కే విశ్రాంతి యివ్వకపోతే చెడిపోతున్నప్పుడు చైతన్యవంతమైన శరీరానికి కూడా కొంచం విశ్రాంతి యిస్తూ ఉండాలి. విశ్రాంతి అంటే ఎయిర్ కండీషన్ రూంలో డన్‌లప్ బెడ్ మీద తలుపులు వేసుకొని పడుకోవటం కాదు. Change of work is Rest అనే విషయం విస్మరించరాదు. కొంచంసేపు ఆటలు ఆడాలి, పాటలు పాడాలి. ఇంటిపనులు చూచుకోవాలి, మంచి పుస్తకాలు చదువుకోవాలి. ఎప్పుడు చూచినా ఏదో ఒక పనిచేస్తూనేఉండాలి. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఎప్పుడైనా ఆగుతున్నాయా? దుఃఖములోనున్నా, నిద్రలోనున్నా, నడుస్తున్నా వాటి పనులు అవి చేయటంలేదా? ఇది దాని సహజ లక్షణం. దైవత్వము యొక్క సృష్టిరహస్యం. ఇట్టిదైవ రహస్యమును అతి సూక్ష్మమైన మార్గంలో తెలుసుకోవటానికి ప్రయత్నించాలి. కేవలం ముక్కుమూసుకొని దొక్కలు పట్టుకొని జపం చేస్తే ప్రయోజనం లేదు. యాత్రలు చేసిననూ ప్రయోజనం ఉండదు. సేవయందే ఈ దైవత్వాన్ని పొందాలి. అదియే విశ్వవిరాట స్వరూపము.

## అర్జునులే...

అర్జునుడు మాత్రమే విశ్వ విరాటస్వరూపం చూడటానికి అర్హుడని భావించరాదు. మీరందరూ అర్జునులే. పృథ్వీపుత్రుడు పార్థుడు. అందరూ పృథ్వీపుత్రులే. అందరూ పార్థులే. పారిపోవటానికి ఏ మాత్రం ప్రయత్నించకూడదు. నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించమన్నాడు శ్రీకృష్ణుడు. యుద్ధం చేస్తూనే నన్ను స్మరించమన్నాడు. పనులు చేస్తూ కూడా భగవన్నామాన్ని స్మరిస్తూ చేయాలి. అర్జునుని నిమిత్తమాత్రుంగా పెట్టుకొని కృష్ణుడు ప్రపంచానికి సందేశమిచ్చాడు. కనుక అహంకారానికి అవకాశం యివ్వకుండా ప్రతి ఒక్కరూ సేవలలో పాల్గొనాలి. తమ వంతు కర్తవ్యాన్ని నిష్కామబుద్ధితో నిర్వర్తించాలి. పేరు ప్రతిష్ఠలను అభివృద్ధిగావించేది ఒక్క సాయి నామమే అనే విషయం మరువరాదు.

## పాపభీతి, దైవప్రీతి, సమాజనీతి

నా 60 వ సంవత్సరంనుండి ఆధ్యాత్మిక తత్త్వమును అద్వైత మార్గములో ప్రబోధించడానికి పూనుకున్నాను. ప్రపంచం సహస్ర నేత్రములతో మనపైపు చూస్తున్నది. మనలో కించిత్ కూడా ఇతరులు వేలుపెట్టి చూపే భావాలు గాని పనులు గాని వుండరాదు. ఒకరు అధికులని, మరొకరు తక్కువవారని భావించరాదు. అందరూ సోదరులే. ప్రేమ భావాన్ని పెంచుకోవాలి. అనేకత్వంలోని ఏకత్వాన్ని జగత్తుకు నిరూపించాలి. అందరం కలిసి మెలిసి పని చేద్దాం, కలిసి మెలిసి తిరుగుదాం, పెరుగుదాం, తెలివిని పోషించుకుందాం. బలహీనతలను ప్రబోధించే శల్య రధసారధులు కొందరు వుంటారు. అట్టి వారికి యిక్కడ అవకాశం వుండదు. కృష్ణ సారధ్యం కావాలి గాని, శల్య సారధ్యం వుండరాదు. ఈనాడు మనకు కావల్సింది "పాపభీతి, దైవప్రీతి, సమాజనీతి" దీనిని పెంచుకోవాలి. మానవత్వపు విలువలను అలవరచుకోవాలి, అమలు చేయాలి. అధికారం కోసం ప్రాకులాడే దానికంటే, కర్తవ్యమును గుర్తించాలి. అందరూ ఒకే కుటుంబ సభ్యులమని భావిస్తూ, సమైక్య కృషి ద్వారా సాయి సంస్థల పేరు ప్రతిష్ఠలను ఇనుమడింప చేయడానికి కృషి చేయాలి. ఉత్సాహంతో ముందుకు నడచి ఆనందాన్ని అనుభవించి, ఇతరులకు పంచి, జన్మ సార్థకత చేసుకుంటారని, ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

(నవంబరు 22, 23, 24 తేదీలలో ప్రశాంతి నిలయంలో భగవాన్ బాబావారు చేసిన ప్రసంగముల నుండి ).



# నవభారత నిర్మాత డా|| బాబూ రాజేంద్రప్రసా

మన దేశ స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటాలు, శౌర్యగాథలు, త్యాగాలు, బలిదానాలు తలచుకుంటే హృదయం ఉప్పొంగిపోతుంది. బ్రిటీషు వారు భారతీయులమీద జరిపిన అమానుష, కిరాతక, పైశాచిక కృత్యములు తలచుకుంటే మనస్సు వికల మవుతుంది. వేలాదిమంది విప్లవ వీరులు తెల్లదొరల తుపాకి గుండ్లకు బలైపోయారు. మరికొంతమంది ' వందేమాతరం ' అంటూ ఉరికంబాల నెక్కి కన్నుమూసారు. మరికొంత మంది నేతలు శాంతియుత ఉద్యమాలను నడిపి ప్రజలను చైతన్యవంతులను చేసి, రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కూకటి వేళ్ళతో పెకలించి వేసారు. ఆ మహోద్యమంలో ఎందరో అశువులు బాశారు. మరెందరో వారి వృత్తులను విడనాడి, స్వవిషయాలకు ఏ మాత్రం ప్రాధాన్యత నివ్వకుండా, నిష్కామకర్మ చేసారు. అట్టివారిలో బాబూరాజేంద్రప్రసాద్ ప్రముఖులు.

న్యాయవాద వృత్తిద్వారా ప్రతి నెలా వేలాది రూపాయలు సంపాదించేవారు. అంత సంపాదించే బాబూ రాజేంద్రప్రసాద్ మహాత్మా గాంధీజీ పిలుపు నందుకొని సత్యాగ్రహోద్యమానికి సంసిద్ధమై వెళ్ళేముందు, భార్యకు తొమ్మిదిరూపాయలు మాత్రమే యివ్వగలిగాడంటే ఆశ్చర్యం వేయకమానదు. ఆనాడు ఆమహనీయులు ఆ విధంగా త్యాగం చేసారు కాబట్టే మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. అయితే ఈనాటివారు చెట్టు పేరు చెప్పి కాయలు అమ్ముకుంటున్నారు. ప్రజాసంపదను దోచుకొని కోట్లు సంపాదిస్తున్నారు. చెట్టు నాటేది ఒకడయితే, దాని ఫలాలను సునాయాసంగా అనుభవించే వారు మరొకరవుతారు. ఈ యదార్థం ఈనాడు ఋజువవుతున్నది.

“ నేను ఏ భారతీయ తంత్రాన్ని ఏర్పర్చాలని అనుకుంటున్నానో, దానికొక వ్యవసాయదారుడు అధ్యక్షుడు కావాలి ” అనిన మహాత్మాగాంధీజీ కోరికలు సఫలమైనాయి. భారతదేశంలో అత్యున్నత పదవి రాష్ట్రపతి పదవి. ఆ ఉన్నత పదవికి ప్రప్రథమంగా ఎన్నికోబడ్డారు బాబూ రాజేంద్రప్రసాద్. ఆయన జన్మచే కాకపోయినా కర్మచే వ్యవసాయ దారుడు. అందుచే పూజ్య బాపూజీ ఆశలు కొంతవరకు ఫలించాయనే చెప్పాలి. వీరిలో నిరాడంబరత్వం, కార్యశీలత మూర్తీభవించి ఉన్నాయి. వీరి హృదయం హాలికుని హృదయంలా కపటమెరుగనిది. పట్టణ జీవితమంటే ఆయనకు నచ్చేది కాదు. ప్రశాంతమైన గ్రామీణ వాతావరణ మంటే ఆయనకు ఇష్టం. చిన్ననాటి నుండే వారిలో ఈ సద్గుణాలు చోటు చేసుకున్నాయి.

కొమ్మగిరి కృష్ణమోహనరావు

బాల్యమునందు రాజేంద్రునకు అతని తల్లి, నాయనమ్మ రోజూ రామాయణ, భారతగాథలు చెప్పేవారు. చిన్ననాడు విన్న భజనలు, రామాయణ గాథలు వర్ణనలు తన ఆత్మకథలో రాజేంద్రుడు వ్రాసుకున్నాడు కూడా. చిన్ననాటి ఇంటి వాతావరణం ఆయనమీద చెరగని ముద్ర వేసింది. ఆనాడు ముసలమ్మలు చెప్పిన కథలు ఆయన జీవితం మీద గాఢంగా పడ్డాయి. ఈనాటి తల్లులకే ఆ పవిత్రగాథలు తెలియవు గదా! అందువలననే ఈనాటి యువతరంలో చాలామందికి నాస్తిక భావాలు అబ్బుతున్నాయి. ఇది నిజంగా దురదృష్టం.

రాజేంద్రుని బాల్య విద్య తన గ్రామమైన జీరాదేయీ ( బీహార్ ) లోనే సాగింది. ఆరోజులలో గ్రామజీవితం బాగుండేది. ఏ గ్రామానికా గ్రామం స్వయంపోషకంగా

విశాలిలుతుండేది. పట్టణాలలోని అధారపడవలసిన దుస్థితి అనాడు ఉండేది కాదు. ఆ గ్రామంలో రెండు దేవాలయాలుండేవి. ప్రతి పండుగకు ఉత్సవాలు జరిగేవి. అలంకారాలు చేసేవారు. ఆ అలంకార కార్యక్రమాలలో శ్రద్ధగా రాజేంద్రుడు పాల్గొనేవాడు. ప్రాథమిక విద్య పూర్తి చేసిన తరువాత చపరా హైస్కూలులో ప్రవేశించి మెట్రిక్ ప్యాసయ్యారు. విక్రమాదిత్య మిశ్రుడనే విద్వాంసుని వద్ద సంస్కృతం కూడా అభ్యసించారు. హిందీతో పాటు పారశీక భాష కూడా నేర్చుకున్నాడు. ఆ తరువాత కలకత్తాలోని డఫ్ కాలేజీలో ప్రవేశించి యఫ్. ఏ. పరీక్షలో ఉత్తముడుగా ఉత్తీర్ణుడై ప్రభుత్వమిచ్చే రు 25 ల విద్యార్థి వేతనమును కూడా పొందాడు. బి. ఏ. పరీక్షలో కూడా సర్వ ప్రథముడుగా ఉత్తీర్ణుడైనప్పటి నుండి 60 రూపాయల విద్యార్థి వేతనాలు రెండు లభించాయి. ఇంతలో ఆయన తండ్రి మరణించారు. ఇలా మధ్యలో విఘాతం రావడం వలన యం. ఏ. పరీక్షలో ఉత్తముడుగా ఉత్తీర్ణుడు కాలేక పోయాడు. తరువాత కొంతకాలం ముజఫర్‌పూర్ కళాశాలలో ప్రొఫెసర్ ఉద్యోగంచేసారు. ఆ ఉద్యోగం మాని కలకత్తాచేరి 1915లో లా పరీక్షలో ఉత్తీర్ణులై 1916 లో పాట్నా హైకోర్టులో ప్రాక్టీసను ప్రారంభించారు. వీరు కోర్టులో వాదించే తీరును చూచి తోటి న్యాయవాదులు, న్యాయమూర్తులు ముగ్ధులైపోయేవారు.

1917 లో ప్రప్రథమంగా మహాత్మగాంధీజీతో పరిచయం ఏర్పడింది. 1920 లో రౌలట్ యాక్టుకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని ప్రారంభించారు మహాత్మాగాంధీజీ. ఆ సందర్భమున ఒక సభను ఏర్పాటు చేసారు. రాజేంద్రప్రసాద్ కూడా పాల్గొన్నారు. వారిని బీహారు సత్యాగ్రహ దళానికి నాయకులుగా నియమించారు గాంధీజీ. ఆ ఉద్యమంలో రాజేంద్రప్రసాద్ చూపిన చాకచక్యానికి, త్యాగానికి ప్రజలు ముగ్ధులైపోయి, అనాటి నుంచి వారిని "బీహార్‌గాంధి" అని పిలువ నారంభించారు.

1921 లో ప్రిన్స్ అఫ్ వేల్సు భారతదేశానికి వస్తారని తెల్సింది. గాంధీజీ ఆ యువరాజుకు స్వాగతం చెప్పడానికి నిరాకరించారు. ఉత్తరప్రదేశ్‌లో మోతీలాల్ నెహ్రూ, బీహార్‌లో రాజేంద్రబాబులు ఉద్యమానికి యువకులను సమీకరిస్తుండగా ప్రభుత్వం వారిని బంధించింది. జైలులో రాట్నం వడకడం ప్రారంభించారు. రాష్ట్రపతి పదవిని స్వీకరించిన తరువాత కూడా రాట్నం వడకడం ఆపకపోవడం విశేషం. 1930 లో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో కూడా పాల్గొని జైలుకువెళ్లారు.

1934 జనవరి 15 న బీహార్‌లో పెద్ద భూకంపం సంభవించింది. అప్పుడు ఆయన జైలులో ఉన్నారు. ఆరోగ్యం కూడా చెడిపోయింది. భూకంప బాధితులకు సరైన సేవచేయగలవారు ఒక్క రాజేంద్రుడేనని ప్రజలు భావించారు. వారి విడుదలకోసం బీహారు నలుమూలల నుండి ప్రభుత్వంపై వత్తిడి వచ్చింది. ప్రభుత్వం ఎట్టకేలకు వారిని విడుదల చేయక తప్పలేదు. అనాడు వారు చేసిన సేవ వర్ణనాతీతము. అనాటితో ఒక బీహార్ ప్రజల హృదయాలలోనే గాక, యావత్ భారత ప్రజల దృష్టిని రాజేంద్రుడు ఆకర్షించగలిగాడు. అదే సంవత్సరం జరిగిన కాంగ్రేసు మహాసభకు బాబూ రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు.

స్వాతంత్ర్యోద్యమంలో వారు చేసిన త్యాగం, ఉద్యమాలలో వారు చూపిన చాకచక్యం, దేశసేవలో వారు చూపిన అపారసేవ, వారి నిరాడంబరత్వం, సహనములే వారిని ప్రథమ రాష్ట్రపతిగా చేసాయి. అనాడు పదవులు కులాన్నిగాని, డబ్బునుగాని చూచి వరించలేదు. అర్హతకు మాత్రమే అవకాశం ఉండేది. టేలెంట్‌ను మాత్రమే గుర్తించేవారు. అంతేకాదు వారు చేసిన త్యాగానికి విలువ నిచ్చేవారు. దురదృష్టవశాత్తు ఈనాడు అది తల్లక్రిందులైంది. రాష్ట్రపతిగా ఎన్నికగుటకు ముందు వారు స్వతంత్ర భారత్ యొక్క రాజ్యాంగ నిర్మాణ సభకు అధ్యక్షులుగా ఉండేవారు. మూడు సంవత్సరాలు ఆ సభ కూలంకషంగా చర్చించి రాజ్యాంగాన్ని తయారు చేసింది.

రాజ్యాంగపు చిత్తుప్రతిని తయారుచేసే బాధ్యతను డా. అంబెద్కర్ గారికి అప్పగించ బడింది. ఆ ముసాయిదాను అందరి సభ్యులతో అంగీకరింప జేయుటకు రాజేంద్రబాబు చేసిన కృషి అద్వితీయం.

రాజేంద్రప్రసాద్ స్వభావం కపటం లేనిది. వారి హృదయంలో ఏ భేద భావానికి తావు వుండేదికాదు. మోసం, కపటం, ఈర్ష్య, ద్వేషాలు వారి దరికి చేరేవి కావు. కర్తవ్య నిర్వహణంలో ఏమాత్రం మొగమాట మునకుగాని, ఆశ్రిత పక్షపాతమునకు గాని, బంధు ప్రీతికిగాని అవకాశం యిచ్చేవారు కారు. దేశాధ్యక్షుడు కాక పూర్వం తన గ్రామ వాసులతో ఎంత ఆత్మీయంగా వ్యవహరించే వారో, అలాగే అధ్యక్షపదవి చేబట్టిన తరువాత కూడా అదే విధంగా ప్రవర్తించేవారు.

ఒకసారి రాజ్యాంగ సభకు అధ్యక్షుడయిన తరువాత తన గ్రామం వెళ్ళారు. అప్పుడు 'హథు' రాజ్యపు రాణీ గారు దర్బారుకు రమ్మని కోరింది. ఆ రాజ్యంలో రాజేంద్రబాబు తాతగారు దివానుగా పని చేసారు. అందు వలన ఆ రాణీగారి ఆహ్వానమును మన్నించి అక్కడికి వెళ్ళారు. రాజేంద్రబాబు రాక సందర్భమున దర్బారు అతి సుందరంగా అలంకరించబడింది. వారికి ఉన్నతాసనము కూడా ఏర్పాటు చేసినప్పటికీ, దానిపై కూర్చొనకుండా తివాచీ మీదనే కూర్చొన్నారు. రాణీగారు ఎంత బలవంతం చేసినా అంగీకరించ లేదు. "నాకిదే సముచితమైన స్థానం. ఇంతకు పూర్వం నేనిచట సేవకుణ్ణి. నేడు కూడా సేవకుణ్ణే" అని అందర్ని ఆశ్చర్యపరిచారు. ప్రాచీన సంప్రదాయాల విషయంలోను, పురాణగాథల మీద వారికి విశ్వాసం అటువంటిది. అలాగని ప్రాచీనమైనదంతా శ్రేష్ఠమైనదని గుడ్డిగా నమ్మేవారు కాదు. సమాజాభివృద్ధికి ఆటంకమై నిలచిన దురాచారాలను నిర్మూలించడానికి ధైర్యంగా ప్రయత్నించే వారు. హరిజనోద్ధరణకు విశేషంగా కృషి సలిపారు. అంటరానితనం నిర్మూలనకు చేసిన కృషి అపారం. ఉత్తమమైన ప్రాచీన సంప్రదాయములను నాశనం గావించటానికి

**బడి గంట**

బడిగంటదిగో మోగింది
బడికి వేగమె వెళ్ళాలి
ప్రార్థన భక్తితొ చెయ్యాలి
పాఠాలన్నీ చదవాలి
ఆటలు, పాటలు నేర్వాలి
ఆరోగ్యమ్మును పొందాలి.

—కవుల ఆంజనేయశర్మ

సుతరామూ అంగీకరించేవారు కాదు. గోరక్షణ విషయంలో వీరి అభిప్రాయం దీనికి తార్కాణం. హిందూ కోడ్ బిల్లును వ్యతిరేకించడం వలన వీరి దృష్టి పవిత్రమైన సనాతన ధర్మముల యెడల ఎటువంటిదో ద్యోతకమవుతుంది. సంస్కృతభాషపై వీరికి అభిమానం మెండు. వీరి కార్యదీక్ష అకుంఠితం. గాంధీజీ వలె వీరు కూడా ఉదయం 4 గంటలకే లేచి, కాలకృత్యములను ముగించుకొని, ముఖ్యమైన కాగితాలను చూచి జవాబులు వ్రాయటం వీరి అలవాటు. ఒక క్షణమైనా వ్యర్థంగా గడిపేవారు కాదు. భారతీయ సంస్కృతియెడల వీరికి అపారమైన ప్రేమ. ఆయన నమ్మిన సిద్ధాంతాలను నిర్మొగమాటంగా అమలు పరచే ప్రయత్నంలో ఎంతటి వివాదాలు ఎదురైనా ధైర్యంగా ముందుకు సాగిపోవటం వీరి ప్రత్యేకత. సహనశీలి, కార్యదీక్షాతత్పరుడు, త్యాగశీలి అయిన బాబూ రాజేంద్రప్రసాద్ మన దేశమునకు ప్రథమ రాష్ట్రపతి పదవిని అలంకరించడం నిజంగా మన అదృష్టమే. ఆ మహనీయుని జన్మదినం (3-12-1884) వారి ఆదర్శమైన జీవనం మనకు స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించి కర్తవ్యోన్ముఖులను గావించుతుందని ఆశిద్దాం. వారి అడుగుజాడలలో నడచి నవభారత నిర్మాణానికి తోడ్పడుదాం.

నవభారత నిర్మాత బాబూ రాజేంద్రప్రసాద్‌కు కృతజ్ఞతలు తెలియపరచుకుందాం.

# అమృత మొసగిన ఆనందసాయి

ఈ చరాచర ప్రపంచాన్ని తరింప చేయటానికి "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్నట్లు ధర్మ సంస్థాపన కోసం జన్మించిన సనాతన సారధి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. వారు భక్తులకు పలువిధాల ఆనందం అందిస్తుంటారు. ఆ ఆనందామృతం అందుకునే భాగ్యం ఎవరికైనా కల్గటం స్వామిపై వారికి ఉన్న అచంచల భక్తి విశ్వాసాలకు తార్కాణం అని నిశ్చయంగా చెప్పవచ్చు. ఒకప్పుడు ఎంతో కాలంగా ఉన్న భక్తులకు ఏమీ ఇవ్వకపోవడం, మొదటిసారి వెళ్ళినవారిని వెంటనే అనుగ్రహించటం, వారి వారి కర్మ ఫలితాన్ని బట్టి జరుగుతుంటాయి.

## ఎస్. శ్రీధర్

నా అనుభవంలో నేను మా అన్నగారు (డాక్టర్ S B. రఘునాధాచార్య, తిరుపతి) కలసి మొదటి సారిగా పుట్టపర్తికి వెళ్ళి స్వామిని దర్శించటం జరిగింది. ఆ మొదటి దర్శనం తోనే స్వామి స్పర్శనం, సంభాషణం, మహిమా దర్శనం జరిగాయి. అదొక మాటలకందని మధురానుభూతి. ఆ తరువాత మా అన్నగారి ఇంట్లో స్వామి విభూతి, అమృతం ఫోటోలలో అనుగ్రహించారు. అప్పటికీ ఇంకా స్వామిగురించి పూర్తిగా నమ్మకం కలగని నేను "స్వామి అందరి రూపం అంటారు కదా! అందుకే సర్వ దేవతా స్వరూపులంటారు కదా! మరి ఒక్క స్వామి ఫోటోలో మాత్రమే అమృతం ఎందుకు రావాలి? వేరే రాముడు కృష్ణుడు ఫోటోలలో ఎందుకు అమృతం రావటం లేద"ని అడిగాను. కొద్ది నిమిషాలలో స్వామి ఆ ప్రక్కనే ఉన్న భద్రాచలం శ్రీరామచంద్ర స్వామి ఫోటోలో అమృతం వచ్చింది. ఆహా! ఎంత ఆశ్చర్యం! ఎంత అద్భుతం! అలాగే తిరుపతిలో ఒక డాక్టర్ గారింట్లో ప్రతి గురువారం వారి ఇంట్లో ఉన్న ప్రతి స్వామి ఫోటో నుంచి విభూతి రావడం నేను స్వయంగా చూశాను. ఆ అనుభూతి వర్ణనాతీతం!

ఇటీవల రేపల్లెలో స్వామి భక్తులు శ్రీ మోహనదేవి గారి ఇంట్లో కొద్దిరోజుల క్రితం స్వామి విభూతి, అమృతం ప్రసాదించారు. నిరంతరం స్వామి ఫోటో నుండి అమృతం, విభూతి స్రవిస్తూ ఇప్పటికీ ఉన్నాయి. అయితే స్వామి "నేను మీకు అమృతం ఇవ్వబోతున్నానని" చెప్పినట్లు, అంతకు ముందురోజు ఆఫోటో క్రిందపడి అద్దం పగలటం, ఆమరునాటి నుండి అందులో నుండి అమృతం స్రవించడం మొదలు పెట్టింది, స్వామి విభూతి ఇచ్చే సమయంలో ఇల్లంతా సుగంధమయం అవుతుందని తెల్లవారేసరికి ఇంట్లో అంతా విభూతి చల్లినట్లుగా ఉంటుందని చెప్పారు.

నిరంతరం సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలతో స్వామిని నమ్ముకొని ధర్మయుత జీవనం కొనసాగించే వారికి స్వామి అనుగ్రహం తప్పక ఉంటుంది. స్వామి సమకాలీనులమై జన్మించి స్వామి మహిమలను దర్శించి, స్వామిని స్పృశించి, స్వామితో భాషించే భాగ్యం మనకు దక్కటం పూర్వజన్మ సుకృతంగా భావించాలి.

సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలతో మానవాళిని ఉద్ధరించటానికి అవతరించిన సద్గురు సాయినాధుని దివ్య లీలా తరంగములందు మునకలు వేయించుచూ, మనలను సర్వదా కాపాడు సాయిరాముని అరుణారుణ దివ్య చరణారవిందాలకు అనేక నమస్సుమనస్సులు.

శ్రీ గురుచరణం సాయీశ శరణం

# ఇచ్చట పొగ త్రాగరాదు

**అమెరికాలో** పొగత్రాగటాన్ని ఈ మధ్య అధికంగా ద్వేషిస్తున్నారు. సిగరెట్ తాగడం వల్ల కలిగే దుష్ఫలితాలని గ్రహించి వ్యాపార సంస్థలు కూడా పొగ తాగడాన్ని నిషేధిస్తున్నాయి. అక్కడ ఆడ మగ కూడా సిగరెట్ తాగుతారు. గర్భవతులైన ఆడవాళ్ళు సిగరెట్‌ని ఓ పట్టాన మానలేరు. దాంతో దుష్ఫలితాలు పుట్టబోయే బిడ్డమీద కూడా వుంటాయి.

సిగరెట్ తాగని ఉద్యోగస్తులకి కొన్ని అమెరికన్ కంపెనీలు వారానికి అదనంగా రెండు డాలర్లు దాకా 'నాన్ స్మోకింగ్ అలవెన్స్' కింద ఇస్తున్నాయి. అంటే సంవత్సరానికి నూటనాలుగు డాలర్లు.

**మనకు తెలియని ప్రపంచం**

మల్లాది వెంకటకృష్ణమూర్తి

ముఖ్యంగా రెడీమేడ్ కన్‌సర్ తయారు చేసే సంస్థలన్నీ ఈ పద్ధతిని అనుసరిస్తున్నాయి. ప్రస్తుతం గైమేన్ కార్పొరేషన్, బోయింగ్ కంపెనీ, గుడ్ ఇవాన్ టైర్ అండ్ రబ్బర్ కంపెనీ మొదలయిన అంతర్జాతీయ కంపెనీలన్నీ ఆ పాలసీని అనుసరిస్తున్నాయి.

ఇందుకు అనేక కారణాలున్నాయి. రెస్టారెంట్స్‌లో, ఇంకా అనేకచోట్ల సిగరెట్‌ని తాగేవారికి ఓ విభాగం, తాగని వారికి మరో విభాగం ఏర్పాటు చేయాలని చట్టాలు అమెరికాలో వున్నాయి. సిగరెట్ తాగనివారు తాగే వారితో కలసి పనిచేసి, ఆ పొగవల్ల బ్రోంకటీస్, ఆస్తమా లాంటి వ్యాధులు తమకి సోకితే కంపెనీ యాజమాన్యం మీద నష్టపరిహారం కోసం దావా వేసే సౌకర్యం కూడా అమెరికాలో వుంది. ఇందువల్ల ఉద్యోగస్తులు సిగరెట్ తాగకుండా చర్యలు తీసుకుంటున్నాయి వ్యాపార సంస్థలు.

పైగా సిగరెట్ తాగే వుద్యోగస్తులు దాని కోసం పని ఆపడం జరుగుతుంది. సిగరెట్ లేకపోతే వెళ్ళి కొని తెచ్చుకోడానికి, అది అంటించుకోడానికి, వంటరిగా తాగలేని వారు తమ స్నేహితులకి కూడా ఇచ్చి ఇద్దరు కలసి సిగరెట్ తాగే సమయంలో ముచ్చటించు కోవటం లాంటి కార్యక్రమాల వల్ల పనిచేసే గంటలు తగ్గే అవకాశం వుంటుంది. ఇందువల్ల వ్యాపార సంస్థలకి సగటున సంవత్సరానికి వెయ్యి డాలర్లు నష్టం వస్తుందని అంచనా వేయబడింది. సిగరెట్ తాగే వాళ్ళే తాగని వాళ్ళ కన్నా అధికంగా సిక్ లీవ్ పెట్టడం కూడా జరుగుతుంది. దీంతో పోల్చి చూస్తే 'నాన్ స్మోకింగ్ అలవెన్స్' ని అమెరికన్ వ్యాపార సంస్థలన్నీ అనుసరిస్తున్నాయి.

వర్క్ స్పాట్‌లో ఏష్‌ట్రేలు లేకుండా చేయడానికి వుద్యోగస్తులు కూడా ప్రయత్నం చేస్తున్నారు. సిగరెట్ తాగేవాళ్ళు కూడా, ఆ అలవెన్స్ సంపాదించుకోవడానికి వాటిని మానేస్తున్నారు. ఫుడ్ ప్రాసెసింగ్, ఎట్లానిక్ మొదలైన సంస్థల్లోని వుద్యోగస్తులు సిగరెట్స్ మానేయడం ద్వారా వుత్పత్తిలోని నాణ్యత కూడా పెరుగుతుంది. అలాంటి సంస్థలు "మా వుద్యోగస్తులు సిగరెట్స్ తాగరు" అన్న సంగతి కూడా కంపెనీ వ్యాపార ప్రకటనల్లో వుపయోగిస్తున్నారు.

సిగరెట్ తాగడం మీద ఈ నిషేధాన్ని సిగరెట్‌ని కాల్చేవారు, కాల్చనివారు సమానంగా మెచ్చుకుంటున్నారు. ఇక మెచ్చుకోనిదల్లా సిగరెట్‌ని తయారు చేసే సంస్థలే.

సత్యనారాయణగారికి గొంతులో తడి ఆరిపోయింది. నోట్లో మాట పెగల్లేదు. అతి బలవంతాన...

'హలో సత్యనారాయణ స్పీకింగ్' అనగలిగాడాయన.

టక్కున ఆగిపోయిందా నవ్వు.




క్షణంపాటు ....

నిశ్శబ్దం ....

ఏ దుర్వార్త వినవలసివస్తుందో అని ఊపిరి బిగపట్టి వింటున్నాడాయన.

"హలో ఇది డబల్ టూ ఫైవ్ జీరో సిక్స్ కాదాండి" అంది అవతల కంఠం.

ఒక్కక్షణంపాటు గొప్ప రిలీఫ్

" కాదు నాయన ఇది డబుల్ టూ ఫైవ్ ఒన్ సిక్స్ " అన్నారాయన విసుగు చిరాకు మిళితమవుతున్న స్వరంతో.

" ఓ సారీ రాంగ్ నెంబరండి " అని అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడు విన్పించింది.

" ఓహో భగవాన్ ! ఎవరికి అపకారం చేశానని నన్నిలా హింసిస్తున్నావు" అని నిస్తేజంగా సోఫాలో వాలిపోయారు.

అయన ఒక్క క్షణంపాటు కళ్ళు మూసుకున్నాడు.

తలంతా వేడెక్కినట్లయ్యింది. ఇంకా షాక్ నుంచి తేరుకోలేదు. ఇంతకీ ఇంతకు ముందు చేసింది కూడా రాంగ్ నెంబరేమో అన్న సందేహం కలిగిందాయనకు.

" రాంగ్ నెంబరయితే శిల్ప పేరు, తన పేరు పిలచి మరీ అవహేళన చేస్తాడా అది ఖచ్చితంగా బెదిరింపే " అనుకున్నారాయన. ఆ వ్యక్తి కంఠంలోని తీవ్రతా, కాఠిన్యత అయన్ని ఇంకా కలవరపెడ్తున్నాయి.

వెంటనే ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా అయన ఒక నెంబర్‌కి డయల్ చేశాడు.

అవతల రింగ్ అవుతున్న శబ్దం విన్పిస్తూంది. అంతలో ఎవరో ఎత్తిన శబ్దం విన్పించింది.

" హలో కమీషనర్‌గారా ? " అడిగాడాయన

"ఒక్కసారి పిలుస్తారా ! నా పేరు సత్యనారాయణ"

" .... .... "

" హలో నమస్తే ! నేను సత్యనారాయణని మాట్లాడుతున్నా. మా అమ్మాయిని ఎవరో కిడ్నాప్ చేసినట్లు అనుమానంగా వుంది. నాకిప్పుడే ఒక ఫోన్ కాల్ వచ్చింది " అంటూ అయన ఆపకుండా తను చెప్పాల్సింది చెప్పేశారు.

" మీరే వస్తున్నారా ? థ్యాంక్స్ ఉంటా " అంటూ ఫోన్ పెట్టేశారాయన.

సత్యనారాయణగార్కి ఆ నగరంలో డబ్బున్న వ్యక్తిగానే కాక మంచి మనిషిగా కూడా పేరుంది. కమీషనర్ కూడా అయనవల్ల సహాయం పొందబడ్డ వాళ్ళలో ఒకడు.

కమీషనర్ తెల్లటి అంబాసిడార్‌ని చూడగానే గేట్లు తీసాడు గూర్ఖా. వినయంగా సెల్యూట్ చేశాడు.

కమీషనర్ కారు లోపలకి వెళ్తుంటే గూర్ఖా చటుక్కున వంగి తన సీటు పక్క వున్న 'ఎర్రటి స్విచ్' నొక్కాడు.

తెల్లటి అంబాసిడార్ లోంచి హుందాగా దిగాడు కమీషనర్ ముకుందరావు. దాదాపు ఏభై ఏళ్ళ పైనే వుంటాయి. సైడ్ బర్న్స్ తెల్లగా నెరిసి మెరుపు కన్పిస్తుంది. డేగ కళ్ళల్లో ఉండే తీక్షణత అయన కళ్ళల్లో వుంది.

తను రావటం చూసి సెల్యూట్ కొట్టిన గూర్ఖా చటుక్కున కిందకి వంగి ' స్విచ్ ' లాంటి దాన్ని నొక్కటం అయన దృష్టిలోంచి పోలేదు.

అంతలో —

అదరాబాదరా సత్యనారాయణగారు కారు దగ్గరకి వచ్చి కమీషనర్ ముకుందరావుని రిసీవ్ చేసుకొని లోపలికి వెళ్ళారు.

పార్వతమ్మగార్కి ఒక అలవాటుంది. భర్త దగ్గరికి ఎవరన్నా వస్తే ఆమె ఆ పరిసరాలలోకి రాదు.

ఇరువురూ సోఫాలో కూర్చున్నారు.

( జరిగిన కథ )

హాస్పిటల్‌లో చేరిన ఆలేఖ్యని చూసి వచ్చాడు యస్. ఐ. భరద్వాజ. ఆమెకి రాత్రి దాకా స్పృహ రాదని తెలిసింది. ఆలేఖ్య తండ్రి సత్యనారాయణగారు ఆ నగరంలో ఉన్న ధనవంతులలో ఒకరు. వారి యొక్క ఏకైక కుమార్తె ఆలేఖ్య. ఇంట్లో ఉన్న సత్యనారాయణగార్కి ఆలేఖ్య విషయమై బెదిరింపు ఫోన్ వచ్చింది ఏం చెయ్యాలో అర్థం కాని స్థితిలో మళ్ళీ ఫోన్.

( ఇక చదవండి )

## ప్రభవం

చిక్కని క్షీరంతో క్షుధార్తిని దీర్చుకుని
ఆదమరచి నిద్రిస్తున్నాయి పల్లెసీమలు
వెన్నెలే పాలనుకుని ఆకాశం కేసి
ఆశగా అర్రులు చాస్తున్నాయి పట్టణాలు

-నారాయణం శేషుబాబు

ఇంతలో నౌకరొచ్చి ఆరెంజి జ్యూస్ రెండు గ్లాసులు ట్రేలో తీసుకొచ్చాడు.

అది తీసుకొని నెమ్మదిగా సిప్ చేయసాగారు. "ఊఁ, ఇప్పుడు చెప్పండి" అన్నాడు కమీషనర్ సంభాషణకి ఉపక్రమిస్తూ.

సత్యనారాయణగారు వేడిగా ఒక నిట్టూర్పు విడిచి తనకి ఫోన్ రావటం దగ్గర్నుంచి బెదిరించటం ఆ తర్వాత రాంగ్ నెంబర్ రావటం అన్నీ చెప్పారు.

"శిల్పంటే మీ అమ్మాయి పేరు కదు ?" అన్నాడు కమీషనర్. ఆయన ఇన్నిసార్లు వచ్చినా పార్వతమ్మ గార్నీ, శిల్పని ఒక్కసారి కూడా చూడకపోవటం విశేషం.

"ఇంతకీ మీ అమ్మాయి ఎక్కడికి వెళ్ళింది ?"

"మా అమ్మాయి వాళ్ళ ఫ్రెండింటికని వెళ్ళింది. ఇంకా రా లే దు . కారు కూడా తీసుకు వెళ్ళలేదు" అన్నారాయన వాచ్ వంక చూసుకుంటూ.

"ఎవరింటికి వెళ్ళిందో తెల్సా ? ఆ తర్వాత మీకు ఏమన్నా ఫోన్ కాల్స్ వచ్చాయా ? అన్నట్టు మీ గూర్ఖా ఎలాంటివాడు ?" అని కమీషనర్ తన అనుమానాన్ని బయటపెట్టాడు.

"ఏం అంత హఠాత్తుగా మీ అనుమానం వాడి మీదకి మరలిందేమిటి. చాలా మంచివాడు. ఎందుకడిగారు?"

"ఏం లేదు. ఇందాక నేను వస్తుంటే నన్ను చూసి ఒక స్విచ్ నొక్కాడు. అందుకని అడుగుతున్నా?"

"ఓహ్ అదా ! అది మా ఏర్పాటే లెండి. ఎంతైనా పోలీసువాళ్ళు కదా ! వెంటనే గమనించి వుంటారు. ఎవరన్నా ఇంట్లోకి వస్తే ఆ స్విచ్ నొక్కుతాడు"

"ఓ అది మీ అరేంజిమెంటా ! అనవసరంగా అతన్ని అ ను మా ని ం చా ! ఇంతకీ మీ అమ్మాయి ఫోటో చూపిస్తారా ?" అడిగాడు కమీషనర్.

"ఉండండి ఇప్పుడే తెస్తా" అంటూ లోపలికి వెళ్ళారు.

ఇంతలో —

"ట్రింగ్ .... ట్రింగ్ .... ట్రింగ్ ...."

అంటూ ఫోన్ మోగసాగింది.

అక్కడ ఎవరూ లేకపోవటంతో కమీషనర్ ఫోన్ ఎత్తాడు.

"హలో"

" "

"ఆఁ నేనే మాట్లాడుతున్నా. ఏం కావాలి ?"

"ఆఁ వ్వాట్ ? ఇప్పుడే వస్తున్నా" అంటూ ఫోన్ పెట్టేశారు.

సత్యనారాయణగారు ఆల్బమ్ తీసుకుని వచ్చారు.

ఆయన వచ్చేసరికి పోలీస్ కమీషనర్ వెళ్ళటానికి సిద్ధంగా వున్నారు.

"ఎవరితో ఫోన్లో మాట్లాడుతున్నారు ? మళ్ళీ ఆ ఫోనేన" అంటూ కంగారుగా అడిగారు. "ఆఁ మా ఆఫీసు నుంచే. సినిమాహాల్లో రెండు హత్యలేవో జరిగాయట. అందుకని నేనర్జంటుగా వెళ్తున్నా" అంటూ సత్యనారాయణగారి దగ్గర సెలవు తీసుకున్నారు.

కమీషనర్ వెళ్తున్న వైపు చూసి ఒక్క నిట్టూర్పు విడిచారు. తెచ్చిన ఆల్బమ్ టేబుల్ మీద పెట్టారు.

(స శే ష ం)

# విద్యా ప్రయోజనము

## డా॥ చేబోలు చిన్మయబ్రహ్మకవి

**భారతీయ** సంస్కృతిలో విద్యకుఁ గల స్థానము విశిష్టమైనది. ఈ పరమార్థమును మిగిలిన దేశములు క్రమక్రమముగా ననుసరించినవి. మన భారతీయ మహర్షుల దృక్పథము లోక కల్యాణము. సిరిసంపదలు గలిగియుండుట భౌతిక ప్రయోజనము కాఁగా, ఆత్మ జ్ఞానముతోఁ దన్నుఁ దానెఱిఁగి జీవిత లక్ష్యమును సాధింపఁ గల్గుట. ఈ రెంటిని వారూహించియే తమ ప్రబోధములు గావించి యున్నారు. వారి పలుకులు వేద వాణి ననుసరించి యుండుట గమనార్హము.

దేనిని దెలిసికొనుట వలన నాత్మ శాంతి, తృప్తి కల్గునో, రాగద్వేషములు తొలగిపోయి పరమానందము లభించునో అట్టి పరబ్రహ్మమును గూర్చి చెప్పునదియే వేదము. పరబ్రహ్మమనఁగా నిర్గుణమైనను సగుణమైనను - సత్య శివ సుందరమై యున్నది. విజ్ఞుల అభిప్రాయములోఁ బరమాత్మకును దైవీగుణములకు భేదము లేనే లేదు.

చరాచర జీవ జగత్తునకు మూలమైన వాఁడును, మఱపు దెలుపు ఎఱుకల కాశ్రయమైన వాఁడును, లోకాలోకముల కాధారభూతుఁడైన భగవంతుని దయ వలననే సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి. ఆ మహనీయుని కృప వలననే జీవుల జీవయాత్ర కొనసాగుచున్నది. ఈ విజ్ఞానము నార్జించుట కొఱకే గురువులు విద్యాభ్యాసారంభమున తొల్దొల్త 'ఓం నమశ్శివాయ' అను దివ్యాక్షరములను విద్యార్థిచే దిద్దించుచుందురు. పూర్వ గురుకులములలో నీ ప్రాతిపదికపైనే వేదములు, ఉపనిషత్తులు, పురాణశాస్త్రములన్నియు బోధించుచుండెడి వారు. అట్లే లౌకిక ప్రయోజనములకై చతుష్షష్టి కళలను శిష్యులకు గఱపు వారు. విద్యార్థుల పూర్వ వాసనను బట్టి బ్రహ్మ విద్యావేత్తలుగా, లౌకిక విద్యావేత్తలుగా నాయా మార్గముల ననుసరించెడివారు.

అన్ని జన్మలలోను మానవ జన్మ పరమోత్కృష్టమైనదని గ్రహించి జీవితకాలమును అమూల్యమని భావించి జ్ఞానార్జనయందును, దానిని ఆచరణలోఁ బెట్టుటలో నప్రమత్తులై యుండవలెనని "స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్" అని హెచ్చరించి యున్నారు. ఆనాఁటి గురుకులనందన వాటికలలోఁ బూచిన సత్యము, అహింస, దయ, సమత, వితరణము-మున్నగు సుగుణ పారిజాతముల సువాసన - సమాజమును చైతన్యవంతము గావించెడిది. ఆనాఁటి విద్యార్థులు బ్రహ్మజ్ఞాననిధులై ప్రకాశింపఁ గలిగినారు.

అనేక శాస్త్రములు, అశేషవాఙ్మయమంతయు - భగవదర్పితమైన జీవితమే ధన్యమైనదని ముక్తకంఠముసఁ జెప్పుచుండఁగాఁ గేవలము ప్రాకృత సుఖాభిలాషి యగు మానవుఁడా సత్యమును గుర్తింపక క్షణిక సంసారమునఁ జిక్కి మాయావలయమునఁ బతనమగుచున్నాఁడు.

ఇంతటి విశ్వజనీనమగు, విశాల దృక్పథము గల భారతీయ విద్యావిధానము ఇతర దేశ నాగరికతా ప్రభావమున నామ మాత్రావశిష్టముగానున్నది. విశ్వవిద్యాలయములు, కళాశాలలు, ఉన్నత పాఠశాలలు వేయునేల అన్ని విద్యాలయములు - భారతీయాదర్శములను చిలుక పల్కులవలె పల్కుచున్నవేకాని, అందెందు వెదకినను - ఆచరణ దక్షత కానవచ్చుట లేదు. ఆచా

శ్రీ గురూజీ చెప్పిన కథలు

# అహంకారానికి దూరంగా ఉండు

సామాజిక కార్యకర్తలు ఒక్కొక్కసారి అహంకారానికి గురి అవుతుంటారు. నేను కర్తవ్యశీలిని, ప్రజ్ఞావంతుణ్ణి అన్నది అర్థం చేసుకోలేకపోతున్నారు అనుకొంటారు. ఇటువంటి ఆలోచనకు దూరంగా ఉండాలి.

పూర్వకాలంలో మన దేశంలోని మహానుభావులందరు వినయ సంపన్నులుగా ఉండేవారు. ఎవరైనా తమ సందేహాన్ని తీర్చుకోవడం కోసం వారివద్దకు వెళ్ళితే "నీకు వచ్చిన సందేహమే ఒకప్పుడు నాకు కూడా కలిగింది. నేను మా గురువర్యులను అడిగాను. ఆయన చెప్పిన విషయాలనే నీకు చెబుతున్నాను. నీకు నచ్చితే స్వీకరించు లేనట్లయితే వదలిపెట్టు" అనేవారు.

ఇదంతా నేను స్వయంగా తెలుసుకొని చెబుతున్నాను అని ఎవ్వరూ అనేవారు కాదు. ఉపనిషత్తులలో "మహా మేధావులైనవారు సుదీర్ఘమైన ఆలోచన జరిపిన తరువాత ఈ విషయాలను నాకు చెప్పారు. నేను దానినే మీకు చెప్పాను" అని ఉన్నది. "నేను స్వయంకృషితో, స్వీయప్రతిభతో దీనినంతా తెలుసుకొన్నాను, దీనిని అందరికినేర్పుతాను" అని ఋషులెన్నడూ చెప్పలేదు.

—"కథాకల్పతరువు" నుండి

ధ్యులు మొదలు విద్యార్థులవఱకు కేవలము 'ఉదర పోషణ దృష్టి' తప్ప విశిష్టమగు బ్రహ్మ విద్యాభావన కాని., సద్గుణసమారాధన గోచరమగుట లేదు. వేలు వందలు చదువుచున్న వారి సంఖ్యా బలమధికముగా మిన్నుముట్టుచున్నదే కాని., వారియందు సాటి వారి యెడఁ బ్రవర్తింపవలసిన విజ్ఞత, వినయప్రేమలు లవలేశము కానవచ్చుట లేదు. బండను శ్రమించి దొలిచి చక్కని రూపమిచ్చెడు శిల్పిని జాతి విస్మరించుచున్నట్లే బహుళ విజ్ఞాన సంపద నందఁజేసి యొకానొక వ్యక్తిగాఁ దీర్చి దిద్దిన గురువు నీనాఁడు విద్యార్థి యెప్పటికప్పుడే విస్మరించుచున్నాఁడు. గురువుల బాధ్యత, పవిత్రతలోని సహస్రాంశమును సైతము గ్రహింపక విద్యాధికులము-ఉన్నతోద్యోగులమైతిమిగదా! యని గర్వ పర్వతారూఢు లగుచుండుట అంతటఁ బరిశీలించుచున్నాము. నిజమైన గురువులు శిష్యులకు పాఠములు చిత్తశుద్ధితోఁ జెప్పుదురే గాని వారినుండి యేవిధమగు ప్రతిఫలమును కోరరు. తాము బోధించిన నీతులనాచరణలోఁ బెట్టిన యెకరిద్దరిని జూచి యుప్పొంగి పోవుదురు. గుణహీనులగు శిష్యులెదురైనను దమ కేమియుఁ దెలియనట్లు తొలఁగి పోవుచుందురు. తాను నాటిన విత్తనము - మొక్కై వృక్షమై కమ్మనినీడను, పువ్వులను, రుచికరములగు ఫలములనిచ్చుచుండుట చూచి యెవ్వరైనను ఆనందింపకుందురా?

పరమా దర్శమును బోధించు మన భారతీయ సంస్కృతి - ఇతర దేశములకారాధ్యముగా నున్నది. మన వారిలో భౌతిక దృక్పథ మెక్కువగాఁ గానవచ్చినట్లు ఆత్మ జ్ఞాన దృక్పథము కనిపించక పోవుట దుర దృష్టమనియే చెప్పవలెను.

—0o0—

( కథ ) **పుంగవుడు** — డాక్టర్ మిరియాల రామకృష్ణ

## క్లాసులో నారదుండూ తుంబురుడూ కథ జరుగుతోంది.

**మధ్యాహ్నం రెండున్నర. షిఫ్టు సిస్టంలో జరిగే కాలేజీలో అది మామూలుగా మూడో పిరిడు. మాష్టారొస్తేగానీ క్లాసులోకి రాని విద్యార్థులు కొందరు ప్రతి కాలేజీ లోనూ ఉన్నట్టే, ఆ కాలేజీలోనూ ఉన్నారు. బహుశా అలాంటివారు వాహనయోగం గలవాళ్లో కాయపుష్టి గలవాళ్లో అయి ఉంటుంటారు.**

'నారదుడు తుంబురుడి ఇంటికి వెళ్ళాడు. అరుగు మీద వీణ కనబడింది. తుంబురుడేడీ అని నారదుడడిగాడు. ఇప్పుడేనండీ లోపలికి వెళ్ళారు తుంబురుడుగారు అని ఎవరో చెప్పారు. మంచినీళ్ళు తాగడానికేమో!' అంటూ తెలుగు మాస్టారు సరదాగా వ్యాఖ్యానించారు. పిల్లలు చిరునవ్వులు విసిరారు. అంటే అర్థమయిందన్న మాట.

సరిగ్గా అదే సమయానికి గడపలో అడుగు పెట్టాడో విద్యార్థి. 'మే ఐ కమిన్ సార్' అంటూ బొంగురు గొంతును పలికించడంతో ఊరుకోక, తన ఎన్. సి. సి. అనుభవాన్ని అందరికీ రుచి చూపించాలని కాబోలు బూటుతో గట్టిగా చప్పుడు చేశాడు.

'వస్తే రావయ్యా పెద్దమనిషీ. అడిగి రావాలా ఏమిటి? నన్నింకెప్పుడూ డిస్టర్బ్ చెయ్యకు!' అంటూండగానే ముసిముసినవ్వులు విసురుతూ లోపలి కొచ్చాడతను.

'పుస్తకముందా? నిన్న ఇచ్చిన సందర్భ వాక్యాలకు వ్యాఖ్యలు రాసుకొచ్చావా?' అన్నారు తెలుగుమాష్టారు.

'నిన్న నేను రా లే ద ం డీ' అన్నాడు ఆ విద్యార్థి పుంగవుడు కాలరెగరేసుకుంటూ. ఓహో ఇవాళే కదూ ఇప్పుడే కదూ వస్తున్నావు? పైగా చాలా ఉత్సాహంగా కనిపిస్తున్నావు ఎలక్షన్లలో నిలబడు తున్నావేంటి?' అన్నారు మాష్టారు.

ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు పుంగవుడు.

'నారదుడికి మర్యాద ఉన్నట్టుగాలేదు. అరుగు మీద ఉన్న వీణను మీటి చూశాడు. అబ్బో! ఏం వీణ! అదీ అసలు సంగతి. ఇంత సంగీతం వచ్చును కనుకనే తుంబురుడు నిండుకుండలాగున్నాడు. రసజ్ఞులు కాని వాళ్ళ ముందు ఎంత కళను ప్రదర్శించినా రాణించదు. గ్రహించే వాళ్ళని బట్టి పాఠం చెప్పాలి. విద్యార్థుల స్థాయిని గ్రహించకుండా నాకు తెలిసిందంతా నేను చెబితే ఏం ప్రయోజనం!" అంటూ మాష్టారు కథను మలుపు తిప్పారు.

చెవిటి ముందు శంఖం ఊదితే, విఫలమవుతుంది. మామూలు మాటలే చెవిటివాడికి వినబడవు. శంఖాన్ని యుద్ధంలో ఊదుతారు. శత్రువు చెవిటివాడైతే, శంఖ ధ్వని సైతం వినబడదు. తుంబురుడెందుకు తన వద్ద అతని విద్యను ప్రదర్శించలేదో అర్థం చేసుకున్నాడు నారదుడు.

మాష్టారు చెప్పే మాటలన్నీ పుంగవుడికేమీ అర్థం కాలేదు. అసలు తుంబురుడెవరో కూడా అతడికి తెలియదు. సందర్భం గోచరం కాలేదు. పుంగవుడు ప్రక్కవాడ్ని అడుగుతున్నాడు మెల్లిగా. "ఎవర్రా ఆ తుంబురుడు? ఏమిట్రా ఆ కథ" అంటూ.

మాష్టారుకి చెవుడేమీ లేదు. గుసగుసలు వినబడ్డాయి. పాఠం చెప్పడానికి సరిఅయిన ఎన్విరాన్మెంటు ఇప్పు డొచ్చింది.

“ తుంబురుడు ఫస్టుక్లాసులో పాసైన ఒక విద్యార్థి అనుకోండి. నారదుడు థర్డు క్లాసు వాడు సంగీతంలో. తుంబురుడికి విష్ణువు సన్మానం చేశాడు. ఆ సన్మాన సభలోకి నారదుడ్ని రానియ్యలేదు. నారదుడేడిచాడు. తుంబురుడి గొప్పతనం అర్థంచేసుకోవడానికి మిత్రుడిగా నటిస్తూ అతనింటికెళ్ళాడు. అక్కడే తెలిసింది తుంబురుడి మహిమ ! ”

ఇలా సాగిపోతోంది మాస్టారి పాఠం. “ అయితే మాస్టారూ ! తుంబురుడ్ని నారదుడు జయించలేదంటారా ” ఎవడో ప్రశ్న విసిరాడు.

అదంతా పింగళి సూరన్న నడుగుదాం కానీ నారదుడు చెప్పినమాట శాస్త్రాదియ్యా చాలా గొప్పగా ఉంది. “ ఉత్తముల మహిమ నీరు కొలది తామర ” అన్నాడు. మన క్లాసు కూడా సరస్సులాంటిదే. నా పాఠం పద్మం లాంటిది. సరస్సులో నీరుంటే నా పాఠం బాగా వికసిస్తుంది. లేకుంటే తీగ ఎండిపోతుంది.

“ మాస్టారూ బెల్లయిపోయిందండీ ” అన్నాడు పుంగవుడు. మాస్టారి మొహం తుంబురిడి మొహంలా చిరునవ్వు విరిసింది.

పుంగవుడు, మాస్టారింకా క్లాసులో ఉండగానే బయటికి నడిచి, స్కూటరేసుకు తుర్రుమన్నాడు. బహుశా మాటినీ కెళ్ళియుంటుంది.

## కాకర

ఎస్. ఎన్. దుర్గారావు

ఇది తీగజాతిలోనిది. కాకరను పెరట్లలో కూడా పెంచెదరు. ఆకులు అరచేతి వలె వ్రేళ్ళు కలిగియుండును. కాయలు కొన్ని పొడుపుగాను, కొన్ని పొట్టిగాను, కొన్ని తెల్లగాను, కొన్ని ఆకుపచ్చగాను ఉండును. పూవులు పసుపు వర్ణము. కాయలకు గొగ్గులుండును.

ఇది మిక్కిలి చేదు రుచి గలది. విరేచనకారి. గుల్మములు, ప్లీహోదరము, మందాగ్ని శూలలు హరించును. దుష్టవ్రణబాధను పోగొట్టును. పాలెపురుగు విషము హరించును. అగ్ని దీప్తినిచ్చును. రక్తదోషములను, జ్వరములను, క్రిములను హరించును. వీర్యమును చెఱచును. ఈ మొక్క సమూల చూర్ణము కుష్ఠరోగములయందు పని చేయగలదని నవీన వైద్యక మతమై యున్నది.

కాకర ఆకు కషాయము త్రాగినను, ఆకు తరిగి కూరగా వండి తినినను, జ్వరములు హరించును. కాకరాకు రసములో నూనె కలిపి యిచ్చిన మశూచి తగ్గును. కాకరాకు రసములో పసుపు కలిపి త్రాగిన మశూచి జ్వరము, పొక్కులు హరించును. మరియు కాకరాకు రసములో నిమ్మరసము కలిపి త్రాగిన మశూచికం రాకుండా ఆపును. కాకరాకు రసం 2 చుక్కలు కంటిలో పిండిన దోష జ్వరములు తగ్గును. కాకరాకు రసము యుక్తిగా సేవించిన వాత రక్తము అరికట్టును. కాకరాకును ముద్దగానూరి వ్రణములపై వేసి కట్టుచున్న నివారణయగును; కాకర కాయలు పులుసుగా చేసుకొని భోజనం చేసిన కడుపులోని దోషములు హరించి క్రిములు నశించును. కాకర వేరు అరగదీసి ఆ గంధము యోనిలో పూసిన అంతర్గతమైన యోని బహిర్గత మగును.

కాకర జాతిలో అడవికాకర అనునది మరియొకటి కలదు. దీనినే పొట్టి కాకర అని కూడా పిలిచెదరు. దీని ఆకులు కాకర కంటె చిన్నవి. పువ్వులకు నాలుగు రేకలు మాత్రమే యుండి పసుపు పచ్చగా నుండును.

కాయలు మిక్కిలి చేదుగా నుండును. ఎండ బాగుగా తగిలినచో చేదు కొంచెము తగ్గును. కఫము, కామిలా రోగములను హరించును.

దీని ఆకులను ఎండబెట్టి చూర్ణముచేసి పులుసు కాచుకుని భుజించిన కడుపులోని నులి పురుగులు నశించును. విరేచనము చేయును. మశూచికమును రాకుండా ఆపును; దీని ఆకు రసముతో బంగారపురేకులు నూరి పుటము వేసినచో సూర్యోదయము వలె ఎఱ్ఱగా భస్మమగును, లోహజాతులన్నియు కూడ దీనితో భస్మమగును.

* * *

# గీత - అమృతవర్షిణి ············ గంగా మహదేవ్

**సంజయ ఉవాచ :**

శ్లో॥ దృష్ట్వాతు పాండవానీకం
వ్యూఢం దుర్యోధనస్తదా ।
ఆచార్య ముపసంగమ్య
రాజా వచనమబ్రవీత్ ॥

ధృతరాష్ట్రులవారి సందేహములకు సంజయులవారు సమాధానమిచ్చుచున్నారు, అనగా వివేక రహితుడు, అజ్ఞాని ప్రశ్నింప సమ్యక్ జయము అనగా విషయాముల మీద, ఇంద్రియముల మీద జయము గల వ్యక్తి (సంజయుడు) సమాధానమిచ్చుచున్నాడు. దీనిని బట్టి ఆధ్యాత్మిక జ్ఞానమును అందించగల అర్హత జితేంద్రియులకు మాత్రమే కలదని రూఢియగుచున్నది.

పాండవుల యొక్క సేనా వ్యూహమును చూచి దుర్యోధనుడు తన గురువైన ద్రోణాచార్యుల వారిని సమీపించి సంభాషింప నారంభించినాడు. దుర్యోధను డనగా దుష్ట యోచనలు గలవాడని అర్థము. ఇట్టివానికి ద్రోణులవారు గురువు.

యథార్థమునకు ఈ కురుక్షేత్ర సంగ్రామమంతయు మన అంతరికత యొక్క స్వరూపమే. మనయందలి దుష్ట యోచనా సమూహమే దుర్యోధనుడు. ఇతడు పాండవుల సైన్యమును చూచి ద్రోణుని సమీపించినాడు. పాండు - అనగా తెల్లని అని అర్థము. సాత్త్వికీ సంపన్న సంకల్ప సమూహములను సైన్యమును చూచి దుష్ట యోచనా సమూహము ద్రోణుని సమీపించినది. ద్రోణమనగా ఒక కొయ్య పాత్ర. దీనినుండి ఉద్భవించినవాడు ద్రోణుడు. పాత్ర అనగా దేహమని అంతరార్థము. దేహము నుండి జనించునది దేహమే. కాన ఇచ్చట ద్రోణులవారు దేహమునకు సంకేతము.

దుర్యోధనుడు ద్రోణుని సమీపించినాడనగా - దుష్ట యోచనలు దేహమును సమీపించినవని, దేహాత్మ ధ్యాసను కలిగింపజూచుచున్నవని అంతరార్థము.

దుర్యోధనుడు ద్రోణులవారికి అత్యంత సమీపముగా వెళ్ళినాడనే విషయమును "ఉపసంగమ్య" అను శబ్దము తెలుపుచున్నది. సంగమ్య - సమీపించి అనకుండా "ఉపసంగమ్య" మిక్కిలి సమీపమునకు వెళ్ళినాడని తెలుపబడుచున్నది. అనగా మనలోని దుష్ట యోచనలు మన దేహమునకు మిక్కిలి సమీపములో, దేహమునకు పూర్తి చెంతన, దేహము నాశ్రయించియే యుండునని భావగర్భితముగా తెలియచెప్పబడుచున్నది.

కావున దుశ్చింతలను, దుర్వృత్తులను, దుస్సంకల్పములను అత్యంత సాధనా బలముతో తప్ప పారద్రోల లేమనియు మర్మ గర్భితముగా ప్రబోధించుచున్నది గీత. గీత అద్భుతములైన అంతరార్థములతో విలసిల్లు అగాధ జ్ఞానసాగరము.

దుర్యోధనునికి ద్రోణుడు గురువు. అనగా దుశ్చింతలకు, దుస్సంకల్పములకు దేహమే గురువు, సర్వస్వము. పాండవులకు ప్రారంభమున ద్రోణుడు గురువైనను వారి జీవిత సారథి భగవానుడు. అనగా ప్రారంభమున సత్సంకల్పములకు దేహము ఆధారముగా (ఆచార్యునిగా) వున్ననూ తుదకు సత్సంకల్పములు దైవమునే తమ ధ్యేయముగా గైకొని జీవుని తరింపజేయునని ఒకానొక అంతరార్థము. భగవద్గీత అనంత అంతరార్థములు కలది. వానిని విచారణా పూర్వక ధ్యానముచేత, దైవానుగ్రహము చేత పొందవలెను.

ఎల్లరును ఈ దివ్య స్థితిని పొంది, ఆనందమంది, తరింతురుగాక —— స్వస్తి.

## నిద్ర కళ్ళు బాగా నులుపుకున్నాడు

పంచెను పైకెగదీసి కట్టుకున్నాడు.

చేత్తో కర్రను ఒకసారి అటూ ఇటూ పట్టుకొని చూచాడు.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

రాజు పెద్దకేక పెట్టాడు. " చంద్రయ్యా - రా - ఆలస్యం చెయ్యకు. ఒకటే దెబ్బ పెట్టు "

రాజు, కళావతీ పక్కకు జరిగారు.

చంద్రయ్య గుమ్మం దాటి హాలులోపలికి పోబోతున్నాడు. ఇంతలో ఒక్కసారి చంద్రయ్య చేతిలోని కర్రను ఎవరో లాక్కున్నారు.

చంద్రయ్య నివ్వెరపోయి వెనుదిరిగి చూచాడు.

సమ్మక్క నిలబడి వుంది.

" సమ్మీ - ఏమిటిది " కళావతి అదుర్దాతో అంటున్నది.

సమ్మకి మాత్రం ఏమీ అదుర్దా లేదు.

చాలా తాపీగా, నింపాదిగా నిమ్మకు నీరెత్తినట్లు నిలబడింది.

చంద్రయ్య సమ్మక్క చేతిలోని కర్రను మళ్ళీ తీసుకోబోయాడు. సమ్మి చంద్రయ్యను ఒక్క కసురు కసిరింది. చంద్రయ్య తెల్లబోయాడు.

రాజు రక్తపుపోటు శిఖరస్థాయికి చేరుతున్నది.

కళావతి నిలబడలేకపోయింది.

గుమ్మం పట్టుకొని అతి కష్టం మీద కాళ్ళను నిలదొక్కుకుంటున్నది.

ఇంతలో బిడ్డడు సంతోష్ నిద్ర లేచాడు.

" కారు " " కారు " మని ఏడుపు.

" అప్పసమ్మగారూ. అసలింతకూ ఈ పాము ఈ హాలులోకి ఎట్టా వచ్చి వుండొచ్చు - ఆఁ వానలు కదూ - మూసీ పొంగిఁది. అందులో కొట్టుకొచ్చిఁదేమో - అయినా గట్టునే వున్న మా జూపిడీ (గుడిసె) ల్లోకి రాలేదే. ఏమో మాయదారి కాలం ఇంత పెద్ద గోడలు ఎలా పాకిందో. ఇంతకూ మీరు ఎప్పుడు చూశారమ్మ గారూ దీన్ని .... "

పనిమనిషికి కోపం వచ్చింది. " సమ్మక్కా - పాము చచ్చాక ఈ పంచాయితీ మొత్తం చూడొచ్చు. ముందు చంద్రన్నయ్యను కొట్టనియ్ "

" కొడతాడులేవేప్ పోరీ - ఏం అంత పరేశాను - ( గందరగోళం) ఏదెప్పుడు జరగాలో అప్పుడే జరుగుద్ది "

సమ్మక్క ధనాశ మీద ఉందని రాజు భావించాడు. "సమ్మీ

చంద్రయ్యా చేతికి కట్టె ఇయ్యి. ఎంత డబ్బు కావాలంటే అంతా ఇస్తాను "

"ఎంతిస్తారేమిటి మారాజులోరు." నవ్వుతూ సమ్మి ప్రశ్నించింది:

"ఎంత కావాలంటే అంత"

పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణ సంకటంలా వుంది. సమ్మి నవ్వుతూనే అంది. "ఇదీ మీ డాకటరీమల్లేనే వుందే. ఎంతంటే అంత అంటారేకాని, ఇంతని అన రేంటి దొరలు "

"సమ్మి - సమ్మి - ఓ వెయ్యి తీసుకోండి. త్వరగా కొట్టు చంద్రయ్యా"

సమ్మి నవ్వింది. ఆ నవ్వుకు పాము కూడా భయపడిపోయింది.

"ధూ - ఏం మనిషివయ్యా నువ్వు" సమ్మి ఉమ్మేసింది. "నీ పాప, పానానికి (ప్రాణానికి) కిమ్మత్తు వేయి రూపాయలే కట్టినావే నీవేం బాబువయ్యా"

రాజు ప్రళయ రుద్రుడల్లే హుంకరించాడు. "సమ్మి చంపేస్తాను నిన్ను"

సమ్మి పరిహాసం చేసింది. ఆ పరిహాసం నుండి ద్వేషం పాయలు పాయలుగా జారువారుతున్నది. జుగుప్స బిందువులు బిందువులై చిందుతున్నది. "ఓయ్ రాజా, పెయ్య ( ఒళ్ళు ) దగ్గరుంచుకుని మాట్లాడు. ఏమనుకుంటున్నావో బద్మాష్. ఎవర్నిరా చంపుతావు నువ్వు-కొడుకు నస్తుంటే మసురులో తాళిబొట్టు ఇమ్మన్న నీ దవాఖానా. గంపెడు కష్టం నెత్తినేసుకొని మా చెల్లి వస్తే దాన్ని మాయ చేసి పట్నంలో మనిషినే అమ్మివేసిన నీ మాయముండాకొడుకు పనులు - నువ్వురా నన్ను చంపుతానంటావ్ - పుండాకోర్. ఏమయ్యా ఇంక బొమ్మలా నిలబడ్డావ్- పద ముందు. చిడియాలు (మెట్లు) దిగు "సమ్మి కాళికగా రణ చండికలాగ రక్త దాహంతో చిందులు తొక్కే- మృత్యు దేవతలా గర్జించింది.

రాజు తన అశక్తత అప్పటికి కాని గుర్తించలేక పోయాడు.

జరిగిన కథ

డా॥ మకరంద్ అన్ని వివరాలతో వాళ్ళ అమ్మకి ఉత్తరం రాయసాగాడు. రాజుకి పక్షవాతం రావటం, ప్రాక్టీస్ కూడా మూల బడిందని, తను కూడా వైద్య వృత్తి మాని పరిశోధనలో వున్నట్టు రాసాడు. అప్పుడు రాజు ఇంట్లో ఓ సంఘటన జరిగింది. కళావతికి బాబు ఉయ్యాల దగ్గర త్రాచుపాము కనబడింది. రాజు ఏంచేయలేని నిస్సహాయ స్థితిలో ఉన్నాడు. పనిమనిషి చంద్రయ్యని పిల్చుకొచ్చింది. పాము ఉన్న చోట అలానే వున్నది.

( ఇక చదవండి )

కళావతి ఏడుస్తూ సమ్మక్క- కాళ్ళమీద పడింది.

రాజు చేతిలోని బ్యాటరీ జారి నేలపై బడింది.

పాము లైటు చెదరడమే తరువాయి బరబర పాకుతూ పోయింది.

'అమ్మోయ్' కేకతో ఎటువారు అటు ముందు తమ ప్రాణరక్షణకై పరుగెత్తారు. ఈ లోపల పక్కింటి మను షులూ వాళ్ళూ వీళ్ళూ ఓ పదిమంది మనుషులు గుమి కూడారు. అందరూ అరిచేవాళ్ళే. కేకలు పెట్టేవాళ్ళే. ఎవరూ క్రియాశూరులు కారు. ఎవరూ ముందుకు రారు. ఎవడి ప్రాణం వాడికి భయం. 'కొట్టు కొట్టు పద పోతుంది పాము చంపండి చంపండి' అనే వాళ్లే ఎవ రిని చంపమంటున్నారు వాళ్ళు. భంగవంతుణ్ణా ??

చంద్రయ్యా టార్చి చేతిలోకి వేసిచూచాడు. ముందు చోట పాము కన్పడలేదు. నలుమూలలా గాలించాడు.

పాము మెల్లగా ఉయ్యాల వైపు పాకుతూంది.

ఉయ్యాలలో సంతోష్ ఏడుపు.

' సమ్మి. కట్టె ఇలాతే ' గుంజుకున్నాడు భార్య చేతినుంచి చంద్రయ్య.

సమ్మి చంద్రయ్యను ఆమె బతుకులో ఎన్నడూ ఎదిరించి వుండదు. ఎన్నడూ పల్లెత్తి మాట అని వుండదు. కాని నేడు ఆ వంక పరక తెగిపోయింది.

మర్యాద చెదిరిపోయింది.

మాతృత్వానికి పర్యాయ పదమైన స్త్రీమూర్తి ప్రతీ కారాన్ని తీర్చుకొనే ప్రళయమూర్తిగా నిప్పులు కక్కు తున్నది. ఆమెను సమీపించడం ఎవరికి సాధ్యం.

కళావతి ఏడుస్తూ పడిపోయింది.

బయట జనమంతా సమ్మిని తిడుతున్నారు. మానవాళి మన స్తత్వమే అంత !

ఎప్పుడూ మానవుడు ఇలాగే విశాలంగా సానుభూతిని ఆకాశమంత వెడల్పుగ దీనుల మీద పరుస్తూ వుంటాడు. కాలువలుగా ప్రవహింపజేస్తూ వుంటాడు. ' ఇది మనిషా? పసరం - జంతువు - పసిబిడ్డణ్ణి పొట్టబెట్టుకుంటుందిట. రాక్షసి - పిశాచం " పదినోళ్ళూ పదివాగుళ్ళు.

సమ్మి పెద్దగా బూతుల్లోకి దిగింది. ఒకటి రెండు బూతులని అపై ఇలా అన్నది. " ఖలేజా (ధైర్యం) కల ఆ మగవాడెవరో ముందుకు రండిరా - పో - పోయి పాము తోక పట్టుకో " ఇదే మాటల్ని ఉర్దూలో కూడా అన్నది.

నిజానికి అక్కడ ఆమె చెప్పిన ఖలేజా కల మగవాళ్లెవరూ లేరమ్మా ! అంతా తెల్లచొక్కాలు వేసుకుని సరదాగా నారాయణగూడాలో సుల్తాను బజారులో తిరిగే ఉద్యోగస్తులు. గంటలతరబడి పోచుకోలు కబుర్లు చెప్పుకుంటూ బస్‌స్టాండుల్లో నిలబడే అతి సామాన్యులు- వాళ్ళంతా నగరం మనుషులు. పల్లెటూరి రైతులు కాదు. గుండెలు తీసే బంటులు కాదు. సమ్మి తిట్లకు వచ్చినవాళ్ళంతా మెట్లు దిగడం మొదలుపెట్టారు. కాని ఈ దశలో చంద్రయ్యలో మానవత్వం వికసించింది.

పాము అప్పటికే తోకపై నిలబడి ఉయ్యాలను చుంబిస్తున్నది.

చంద్రయ్యకు ఇప్పుడు ఎవ్వరూ కనబడటం లేదు,. ఒక్క పాము తప్ప,

స్త్రీలో ఉండే మాతృ హృదయం పురుషునిలో ప్రవేశించింది. శిలా సదృశంగా పాషాణ తుల్యంగా మారిన సమ్మి హృదయంలోని మమతా, కరుణా, మొత్తమూ దిక్కులేనిపై పోకుండా చంద్రయ్య గుండెల నాశ్రయించి అందులో గూడు కట్టుకొన్నాయి. చంద్రయ్య లైటును తీసుకొని కర్ర లేకుండానే ముందుకు నడిచాడు. సమ్మి అడ్డం వచ్చింది. " ఓరయ్యోయ్ నువ్వు సస్తావేంటి ఈ దయ్యాలకోసం. ఇయ్యనీ వాళ్ళను పైసలు ముందు. ముందు రూపాయల కట్టలు తీసుకురానీ. పనైనాక నీ ముఖం చూసేదెవడ్రా"

అడ్డం వచ్చిన సమ్మిని ఒక్క తోపు తోశాడు చంద్రయ్య. ఆ దెబ్బకు ఆమె దూరంగా మెట్లకవతల పడింది.

లైటును ఎడమ చేత్తో పాము పడగకు సూటిగా వేస్తూ కుడి చేత్తో హఠాత్తుగా దాని తోకను పట్టుకొన్నాడు. గిరగిరా నాలుగు చుట్లు చుట్టి నేలకేసి ఠపీమని మోదాడు, ఒకటే దెబ్బ.

పాము తల పగిలి పచ్చడిగా అయిపోయింది. ముందుకు కదలలేక తోకను మాత్రం చక్రాలు చక్రాలుగా మెలికలు తిప్పుతున్నది.

జనంలోంచి ఒకాయన ముందుకు వచ్చాడు అప్పుడు.

" నేను కొడతానుండు " అంటూ కింద పడ్డ వెదురు కట్టెను చేత్తో తీసుకొని పాము తోకమీద నాలుగైదు దెబ్బలు మోదాడు.

పాము చచ్చింది. హీరోలా నిలబడ్డాడు ఆయన.

అందరూ తలోమాట అంటున్నారు.

కళావతి ఒక్క దూకున ముందుకు వచ్చింది.

( స శే షం )

శుభాకాంక్షలతో